సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతిక 4 అ.

# ఆంధ్రపత్రిక
సచిత్రవారపత్రిక
**Founder : K. NAGESWARA RAO**

సంపుటము 48
సంచిక 47
**27-7-55**

మన్మథ శ్రావణ శుక్ల అష్టమి బుధవారం

# ఆంధ్రపత్రిక
## సచిత్రవారపత్రిక
# పిల్లల దసరా సంచిక
## చిత్రాలు, రచనలకు బహుమతులు
## గడువు తేదీ 1955 సెప్టెంబరు 20

రాబోయే విజయదశమి పండుగకు (26-10-55) ఆంధ్రవారపత్రిక పిల్లల దసరా సంచికగా ప్రచురించబడుతుంది. మామూలు ప్రకారం ఈ సంచికలో బాలబాలికల రచనలకు చిత్రాలకు ప్రాధాన్య మివ్వబడుతుంది. 15 సంవత్సరాలలోపు పిల్లల రచనలు, చిత్రాలలో ఉత్తమమైనవానికి బహుమతు లివ్వబడతాయి.

బాలబాలికల రచనలు చిత్రాలుకాక ఈ సంచికలో ప్రత్యేకచిత్రాలు, ఫోటోలు, వ్యాసాలు, కథలు కూడా ప్రచురించబడతాయి. ఆకర్షణీయమైన ప్రత్యేక త్రివర్ణ ముఖచిత్రంతో సంచికను సర్వాంగసుందరంగా ప్రచురించడానికి కృషి చేస్తున్నాము.

బాల బాలికలకోసం ఉద్దేశించబడిన ఈ సంచిక ప్రచురణలో బాల బాలికలు పెద్దలుకూడా మాకు తోడ్పడ గలరని ఆశిస్తున్నాము.

చిత్రాలు, రచనలు పంపేవారు ఈక్రింది అంశాలను గమనించ కోరుతున్నాము.

* చిత్రాలు, రచనలు, ఫోటోలు మా కార్యాలయానికి సెప్టెంబరు 20 వ తేదీలోగా చేరాలి.
* వీనిని ఎడిటర్, ఆంధ్రపత్రిక సచిత్రవారపత్రిక, మద్రాసు 1. అడ్రస్‌కి పంపాలి. కవరుపైనా లేక రేపర్ పైనా, లోపల మొదటి కాగితంపైనా, లేక చిత్రంవెనుకా "ఆంధ్ర-వారపత్రిక దసరా సంచికకు" అని వ్రాయాలి.
* ప్రచురణకు స్వీకరించబడని రచనలు, చిత్రాలు, ఫోటోలను తిరిగి తమకు పంపగోరేవారు వానితోపాటే అవసరమైన స్టాంపు చేర్చి పంపాలి.
* రచనలు అచ్చులో మూడు పేజీలను మించకూడదు. కాగితంపైన ఒకే ప్రక్క సిరాతోనే వ్రాయాలి. చిత్రాలను డ్రాయింగ్ పేపరుపైన ఇండియన్ ఇంక్‌లోనే వ్రాసిపంపాలి. బొమ్మలు రంగులలో కాని, రంగు కాగితంపైన కాని పెన్సిల్, సిరాలతో వ్రాసినవి కాని స్వీకరించబడవు.
* 15 సంవత్సరాల లోపు బాలబాలికలు మాత్రమే పోటీలో పాల్గొనవచ్చును.
* రచనలు, చిత్రాలు స్వతంత్రమైనవై ఉండాలి.
* పోటీలో పాల్గొనడానికి రుసుము లేదు.
* రచయితలు, చిత్రకారులు తమ పూర్తి పేరు (ఇంటిపేరుతో సహా), వయస్సు, చిరునామా అన్నీ వివరంగా రచనలూ చిత్రాలతోపాటే వ్రాసిపంపాలి.
* రచనలు చిత్రాలనుగురించి ఉత్తరప్రత్యుత్తరాలు జరపవద్దని రచయితలను చిత్రకారులను కోరుతున్నాము.

—సంపాదకుడు.

ముఖచిత్రం: నర్తకి వహీదా రహమాన్.

# విషయానుక్రమణిక

ఏకాంకిక: 4

# లవంగి

## గుడిమెళ్ల బాలా త్రిపురసుందరి

(పండితరాజును చూచిన లవంగికి—

"మొగలిపూవులు దావి బుక్కిలించినయట్లు
దొంగ కన్నెనీలంపు నగవు జార్చినయట్లు
నవవసంతపుశోభ భువి గప్పికొన్నట్లు
శివుచెంత శర్వాణి సిగ్గుజార్చినయట్లు
గన్నెమదిః గోరికల కలలు దూకినయట్లు"—

పుష్పధన్వుని ములుకు సోకింది—

### పాత్రలు:

లవంగి—యవనకన్య
పండితరాజ—విఖ్యాత సంస్కృత కవి తెలుగువాడు
సుబేదారు
అక్బరు పాదుషా
అబుల్ ఫజల్—

[పాదుషా ఉద్యానవనము. పూవులు చివురించి ఉన్నాయి. తరుశాఖలనుండి యౌవన వసంతశుభోదయాన్ని ఘోషిస్తున్న పికాంగనాగానస్వనంతో దిక్కులు పిక్కటిల్లుతున్నాయి. ఆకుల్లో దోబూచులాడు వికసిత పుష్ప స్తబకాలకు ప్రాతర్మందానిలాలు చక్కిలిగిలి పెట్టుచుకిలకిలా నవ్వుతున్నాయి.

లవంగి చంకను సువర్ణకలశాన్నిడుకొని నేలను చూస్తూ వస్తూంటుంది. అనతి దూరంలో పారిజాతవృక్షం దగ్గర పండితరాజు నిలబడిఉంటాడు. అతనిది జులపాల జుట్టు. విశాల ఫాలము. చెవులకు బంగారు తమ్మెలుంటాయి. నవయౌవనంతో మిసమిసలాడుతూ ఉంటాడు.]

పండితరాజు: (లవంగిని చూచి)

యువతీ రమణీ విపద శ్యమనీ-
కమనీయ తమా నవనీత సమా-

లవంగి: (తల పైకెత్తి పండితరాజును క్రీగంట చూచి మందహాసంతో) ఊ!

పండి:

ఉహొఊహొవచోఽమృత పూర్ణముఖీ,
ససుఖీ జగతీ హాయ దంకగతా!

లవంగి: (ఎలనగవుతో) అమృత ఝురీ పూరాల్లో అభిషిక్తమైన మీ కవిత—

పండిత: నీ అధరంకంటె మధురమా?

లవంగి: (నిటూరుస్తూ) మన మధ్య ముక్తాఫలాల మధ్య ఉన్నన్ని ఎడారులు, నదులు, మరీచులు ఉన్నాయి.

పండిత: వలపు రెక్కలతో అవన్నీ దాటిపోగలం.

లవంగి: మిమ్మల్ని చూచి కులభ్రష్టులని లోకం గుసగుస లాడుకొంటూంటే సహించగలనా?

పండిత: బ్రహ్మవిదుడు ఏ కులానికీ చెందడు. కులం లేనివానికి కులభ్రష్టత ఉండదు.

లవంగి: మీది శ్రోత్రియకుటుంబమని మర్చిపోకండి.

పండిత: లోకాన్నంతా కాజీలు, ముల్లాలు, పండాలు, పంచుకొని వాళ్ళకు తోచిన రీతిని కులాల్లో విభజింపనీ. మనిద్దర్నీ వాళ్లు వంటరిగా వదిలేస్తే చాలు.

లవంగి: ఏమైనా నేను యవనబాలికను. (పోబోతూ) [illegible] లతలాగ్గా—

పండిత: (లవంగి ననుసరించుచు) ధృవమే - విశా - ఈ మధుపము—

న మల్లీవల్లీ నా మపి
మధుని వాంఛా...
సమాఘ్రాతో నూనం
యదవధి లవంగీ పరిమళః!

లవంగి: (వెనుతిరిగి) ప్రేమ కూడా ప్రాణాలకు ముప్పుతీసుకొని రాగలదు.

పండిత: ఓహో! అప్పుడు ఆకాశం విరిగి భూమిమీద పడుతుంది. కడలి ఉప్పొంగి భూమిని కబళిస్తుంది.

లవంగి: ఆమాట లెట్లున్నా ముందు ప్రేమికులు సుడిగుండంలో పడిపోతారు.

పండిత: కానీ! పెద్దలా గుండాన్ని తీర్థ ప్రదేశంగా పెట్టిపోతారు. విజ్ఞులిక్కడికి ప్రేమతత్త్వం అభ్యసించడానికి వచ్చి ఒరవడులు దిద్దుకొంటారు—

లవంగి: (ఉద్వేగం) మీరు నా వెన్నంటి తిరుగుతున్నారని జహాపనా†కు నివేదిస్తే—

పండిత: ఏమీ భయంలేదు. ప్రభువు ఉదారుడు, రసజ్ఞుడు.

లవంగి: మర్యాదకు సంబంధించిన విషయాల్లో ఆయన ఔదార్యం వ్యర్థం ఔతుంది.

పండిత: పోయి భిక్షాన్న మారగిద్దాం. దిక్కులనియెడి కవితశాటి కట్టుదాం. రాజులతో మన కేమి పని?

లవంగి: అంత సులువుగా మిమ్మల్ని వదిలేస్తారా? ప్రభువుమాటునుండి కాజీలు అస్త్రాల్ని విసరి మన ప్రేమను వారి మూఢనమ్మకాలకు బలి యిస్తారు.

పండిత: ఓస్! ప్రాణాలకంటె ప్రేమ మధురతరమైంది. క్షణం మనల్ని కాపురం చేయనిచ్చి యుగయుగాంతాలవరకు యమబాధలు పెట్టినా సహించడానికి వెఱువను.

లవంగి: ఇదంతా యౌవనపు పొంగు.

పండిత: (ఆలోచించి) అవచ్చు. బహుశా దానివలనే మనిషి ఏ త్యాగానికైనా నడుం కట్టాడేమో!

† లోకరక్షకుడని అర్థం. ఈమాట పాదుషాకు ప్రయోగిస్తారు.

లవంగి: మీ కున్నంత ఓర్పు నాకు లేదు.

పండిత: చూడాలి.

లవంగి: చాపుకంటె కూడ దుర్భరమైన పరిస్థితి ఏర్పడవచ్చు.

పండిత: ఏమిటది ?

సులవంగి: లేమి - చిప్ప చేతికిచ్చి మనల్ని యుగళాయా కాలువులోంచి తోసి వెయ్యవచ్చు. ఒకవేళ అప్పుడు మనల్ని ఆదుకుంటారా ?

పండిత: ఆదుకోరు.

లవంగి: అప్పుడు అద్దాలమేడల్లో హంస తూలికాతల్పంమీద అపసోపాలు పడు తున్నవారి చిత్తరువులు మీ మనస్సును కలిచి తేసెలు పొలకబోస్తాయి.

పండిత: చెప్పలేం.

యువనీ నవనీత కోమలాంగీ

శయనీయే యది నీయతే కదాచిత్,

అవనీతలమేవ సాధు మన్యే—

లవంగి: (చిరునవ్వుతో) అవచ్చు. కాని కలవు లాలికాదు పూలు వాడిపోతే తమ్మి రేకులవంటి కన్నుల కులుకు శీర్ణిస్తే—



[పండితరాజు క్షిప్తకాలం ఆలోచిస్తూ ఉండిపోతాడు. లవంగి హంసగమనయై రెండడుగులు ముందుకు వేస్తుంది.]

పండిత. (తెప్పరిల్లి)—

ఓ పల్లవిత ఆశాలతా కుంజ మంజుల
హృదయా!
కమనీయ కుసుం భారుణ కోమల రూప
లావణ్యా!

ఓ లవంగీ కురంగీ ముగ్ధ మధు రావ
లోక వార్ధి మధితాంతరంగుండ !

ముత్యపు చిప్పలా నా హృదయం విచ్చి ఉంది. ఆకాశ వీధుల్లో అలా విడిగాపోయే ఓ స్వాతివానా! భూమార్గానికి దిగిరా! నీ రాక ప్రజాళికి శుభం! కవితాకన్యకు మంగళప్రదం ఔతుంది.

[లవంగి వెనుదిరిగి పండితరాజుదగ్గరకు వస్తుంది.]

పండిత: మోదుగు మొగ్గలోని కింజల్కంలా, మన్మథుని విల్లులాగ రాగరంజితమైన నీ నయన జలజాలు నాపై వెన్నెలలు కురిపించి, మెఱపు గుంపులు తళుక్కుత్తిస్తే, అందుండి

అపురూప రత్నాలు

మురిపెంపు ముత్యాలు

పరిపుల్ల పున్నాగ

ప్రసవ సౌరభ్యాలు

పలజల రాలుతవి. వాటిని రసాత్మక పదజాలంలో మూటకట్టుకుంటా.

లవంగి: (ఆశ్చర్యంలో) కవిసమ్రాట్! నీ మధుర వాగ్ధారకు జోహారు. మీ పదాలు కలత పెట్టి కలాపుష్టిని కలిగిస్తాయి. వాని లోతులు తెలిసినవారు తక్కువ.

పండిత. నీ వాణికూడ నా కవితలాగ గండుతుమ్మెదలాగ మంజు గానంతో త్వరితంగా ప్రేమపథాలలో పరుగు వారాలి

లవంగి. ఓ కవీ ! నీ మధురలహరులతో రసికజన హృదయాలలో తరగని వెలుగులు నింపు. పెళ్ళిదారి కంటకావృతమైనది. ఆ దారిని మనం బయలుదేరితే ఓర్వలేని శక్తి ప్రపంచం వెక్కిరిస్తుంది. నీ కోకిల గానానికి ప్రబలాఘాతం కల్గిస్తుంది.

పండిత: ఏం సంభవించినా సరే, ఆ మార్గమే మనకు శరణ్యం. తానంలేని రాగంలా, మానంలేని రాజులా, జ్ఞానశూన్యుడైన యతిలా, నీవు చెంతలేని నా కవిత అర్థంలేని వ్యర్థపదాటోపంతో వెలవెల బోతుంది. జీవితంలోని లోతులు తెలుసుకోనివాడు కవిత్వపు లోతులు తెలుసుకోలేడు. అంతేకాదు. కాముగాని పాతకుడు గామి కాడు.

[దూరంలో ఒక పూపొదరింటి వెనుక అడుగుల సవ్వడి వినవస్తుంది.]

లవంగి: (అవగుంఠనం సవరించుకొని) మీరు ఆ వెనుకడుగోంక వెనుకకు వెళ్ళండి.

పోదుహారూ ఇల్లా వస్తూఉండొచ్చు. (పండితరాజు పెదురుడొంక వెనుక నిలబడతాడు. సుబేదారు ప్రవేశం.)

సుబేదారు: లవంగీ!

[లవంగి మాట వినిపించుకోకుండా వెళ్తుంటుంది. సుబేదారు ఆమెకు ఎదురుగా పోయి దారికి అడ్డుగా నిలబడతాడు.]

సుబే: లవంగీ! జీవితం క్షణభంగురం. ఉన్న నాల్గురోజులూ ఆనందంగా గడుపుదాం. ఇప్పుడా ఉదయభానుడు చివురుబొంపపు సోరణగండ్లనుండి దోబూచులాడుతున్నాడు. ఒకవాడు మనల్ని ఎచ్చటా ఆరయలేక నిలువునా నీరైపోతాడు.

[లవంగి అతని మాట వినిపించుకోదు.]

సుబే: లవంగీ! నాకేం చెప్పావు ?

లవంగి: ఏమీ లేదు.

సుబే: నా ఆస్తి అంతా నీపాదాలవద్ద ధారపోస్తా. నీ కనుసన్నల మెలుగుతా.

లవంగి: అదంతా ఫకీర్లకు పంచిపెట్టు.

సుబే: పూర్తిగా పంచిపెట్టి వస్తే నీ కటాక్షం కల్గుతుందా ?

లవంగి: అల్లా చేసింతర్వాత హజ్జ్*కి పో. అల్లా చేస్తే కటాక్షం కల్గుతుంది.

సుబే: నీది బడా జుల్మ్†! రారా, స్నేహలతలు పెనవైచికొన్న పొదరింటిలో నేనే నీవునై ఉండి నీ సౌందర్యాన్ని నెమలి పింఛంలా విప్పుతా‡

లవంగి: (విసుగుతో) ఛి. పో. జడుడా!

సుబే: (దీనంగా) లవంగీ - ఆ బొమ్మన్ కంటె తీసిపోయానా ?

లవంగి: ఆయన కవి సార్వభౌముడు.

సుబే: ఈడ్చి తంతే దమ్మిడీ ఊడిపడదు.

లవంగి: విజ్ఞకలాగ కవితలో నన్ను మెప్పించినవారి యెడమకాలు నెత్తిన పెట్టుకుంటా.

సుబే: (తల గోక్కొంటూ) అయితే, నేనూ పద్యాలు బరకడం నేర్చుకొంటా—

లవంగి: (సుబేదారుకి వెనుమాటి ముందుకి నడుస్తూ) కళలు పుట్టుకలోనే కలిసి వస్తాయి. కవిత్వం నేర్చుకొంటే వచ్చేది కాదు. కాకిబంగార మెన్నటికీ అచ్చ బంగారం కాదు.

సుబే: (కోపంతో) కవులంటే వడి వస్తావుగాని మాకావూ (కనుమాపు మేరలో ఉన్న (బహ్మదండిడొంక నొకదాన్ని చూపిస్తూ) 'దండి కవీశ్వరుండు మును తా వసించినచోట నెట్టుల నిండెనో బ్రహ్మదండి'—గమనించితివా ?

లవంగి: గడ్డపారలు ఎగిరిపోతే తుప్లాకుల మాట చెప్పాలా ?

* మక్కా యాత్ర.

† పెద్దఅన్యాయం, ‡ ఉమర్ ఖయ్యాం కోరిక.

సుబే: (ఆవేశంతో) అయితే వాణ్ణి చంపించేస్తా.

లవంగి: నీ నిశ్చితం జహాపనాకు తెలిస్తే నీకు పుట్టగతులుండవు.

సుబే: (వెలవెలబోయి కొంచెం నేపటికి తేరుకొని) కాజీచేత మీ మీద ఉన్నవీ లేనివీ పాదుషాకు చెప్పిస్తా.

లవంగి: (సుబేదారువైపు తిరిగి) ఏమని చెప్పిస్తావు?

సుబే: మీరు ఇస్లాంమతానికి కళంకం తెస్తున్నారని ... మీ ఇద్దరికీ 'ఫాంసీ'* తప్పదు.

లవంగి: (ముఖం చిట్లించుకొంటూ) హిందువుకి మీ మతప్రాయశ్చిత్తాలతో నిమిత్తం ఉండదు.

సుబే: ఓహోహో! 'మీ' మతమా! ఇస్లాము నే తోసేస్తున్నావే! మీ రిద్దరూ ముగల్ జనానాకి తీరని మచ్చ అని పాదుషాతో నే చెప్పదలచుకొన్నా—

లవంగి: (బిందె దింపి దోసిలితో కళ్లు మూసుకొని గద్గదకంఠంతో) సుబేదార్! నా గుండెలో చిచ్చుపెట్టున్నావు. నీకు చెల్లెళ్లు లేరూ...(కొంచెమసే పూరుకొని మెల్లిగా తల పైకెత్తి) నామీద ఏ కొండెమైనా చెప్పుగాని ఆ అమాయక త్రిలింగ బ్రాహ్మణుడిపైన లేనిపోని అపవాదువేస్తే జహన్నుమ్† పాలైపోతావు.

సుబే: (వికటంగా నవ్వుతూ) ఓహో! నీ ప్రాణాన్నైనా ఒడ్డుపెట్టావుగాని ఆ బొమ్మన్‌మీద ఈగ వాలనివ్వవు. ఏం ?

లవంగి: సై...తా...న్!

[లవంగి ఏడుస్తుంది. పొదమాటునుండి పండితరాయలు ప్రత్యక్షమౌతాడు.]

పండిత: (సంతోషంతో)

మామకీన హృదయమహాళి
మురలమురల మార్మ్రోగెడు
సుధామధుర పూరమ్ముల
సుఖస్నాత మైనయట్లు
నా యెడంద పొంగిపొరలి
తాండవించె నవ్యరుచుల.

సుబే: (ఒరనుండి కత్తిలాగి ఝళిపించుచు) అరె బుత్ పరస్త్*! మత్యైనా ఉండాలి. నేనైనా ఉండాలి.

లవంగి: ఛీ! సుబేదార్! నిరాయుధుని పై కత్తిదూశావు. ఎందుకు నీ మీసం, దిగ గొరిగించేయి!

పండిత: (పెదురుడొంకనుండి ముందుకు వచ్చి కళ్లను విరిచి) లవంగీ! అమాత్రం ప్రాణ

* ఉరి.

† నరకం.

* విగ్రహారాధకుడా!

# కవిరాజ విరచితము

వేణునాళ నిశ్వాసములలో
గానము వినరాదో ?
గిరినిర్ఝర మర్మర రవళిని సం
గీతము వినబడదో ?
వీనులున్నచో గానము భువినై
వినబడు నెల్లెడలన్.
పరిభ్రమించెడి వియద్గోళముల
ప్రతిరవమే భువనం !

—లార్డ్ బైరన్.

**　**

ఆషాఢములో విరిసిన
అరుణారుణ మందారము
బోలును నా అనురాగము.
మధురస్వర మేళనముల
మణివీణా మృదురాగము
బోలును నా అనురాగము.

—రాబర్ట్ బర్న్స్.

**　**

శ్రుతగీతమ్ములు మధురములే,
కానీ అ
శ్రుతగీతమ్ములు మధుర
తరమ్ములు.

—కీట్స్.

**　**

శైవలాను విద్ధమయ్యు
సరసిజమది రమ్యమే !
మలినలక్ష్మ యుతుడయ్యు, హి
మాంశుడు రమణీయుడే !
వల్కలమ్ము దాల్చియు, నీ
వనిత యతి మనోజ్ఞయే !
మధురాకృతులకు సర్వము
మండనమే కాదా ?

—మహాకవి కాళిదాసు.

(అనువాదం: సం॥రా॥)



మాచ్ ఖండ్ జలపాతం.

లవంగి ★

క్షణం చేసుకోలేనివాళ్ళయితే ప్రపంచమంతా తీర్థయాత్ర చేసి ఢిల్లీ చేరుకోగలవా?

[సుబేదారు పండితరాయలు మీద దళు అంఘిస్తాడు. పండితరాయలు లాఘవంగా తప్పించుకొంటాడు. లవంగి 'త్వరగా రండి వంచకులు, వంచకులు' అని ఎలుగెత్తి అరుస్తుంది. పాదుషా, అబుల్ ఫజల్ అక్కడికి వస్తారు. దూరంనుంచి పాదుషాను చూచి సుబేదారు పరుగు తీస్తాడు. అబుల్ ఇంగితజ్ఞుడు. పాదుషాను చూచి లవంగి సిగ్గుతోనూ, భయంతోనూ తలవంచుకొని వణికిపోతూ నిలబడుతుంది.]

లవంగి: సలాం, జహాపనా, సలాం అబుల్ సాహెబ్!

అబుల్: (బుజ్జగిస్తూ) అమ్మాయీ! (పండితరాయలును చూచి) ఈయ నేనా?

లవంగి: కాదు. వాడు పారిపోయాడు.

పండిత: (పాదుషాతో) నేను అపూర్వ సృష్టిని. జోహారు.

[పాదుషా అబుల్ కేసి చూస్తాడు.]

అబుల్: మీ రిద్దరు - ఒంటరిగా!

పండిత: నేను పాదుషావారి దర్శనానికి వస్తున్నా.

లవంగి: నేను యముననించి వస్తున్నా.

పండిత: ఎవడో మూర్ఖుడు యీమెను పెన్నంటాడు, నన్ను చూచి నామీది కురికాడు.

పాదుషా: మీ ధైర్యానికి సంతోషిస్తున్నాం. (పండితరాజుతో)

అబుల్ ఫజల్: అందుకు బక్షిష్ (బహుమానం) ముట్టుతుంది.

పండిత: (పాదుషాతో) పారితోషికాన్ని యిప్పుడే అడగమంటారా?

[పాదుషా చిరునవ్వుతో అబుల్ ఫజల్ కేసి చూస్తాడు.]

అబుల్: (పండితరాజుతో) చెప్పండి.

పండిత: అడిగినదానికి కాదనరనుకొంటా.

అబుల్: అసంభవం పదివేల మొహరులు కావలసివా సరే—

పండిత: న యాచే గజాలిం.

అబుల్: పోనీ మేలుజాతి అరబ్బీ గుఱ్ఱాల్ని కోరుకోండి.

పండిత: నవా వాజిరాజిం.

[పాదుషా అబుల్ కేసి సాభిప్రాయంగా చూస్తాడు. అబుల్ పండితరాజు వేపు చూస్తాడు. పండితరాజు లవంగిపై దృక్కులు బరపుతాడు.]

లవంగి: కవి రభిప్రాయ మర్థంగాదం.

అబుల్: ఐతే, మీకు హిరణ్యం కావాలన్నమాట.

పండిత: న విత్తేషు చిత్తం మదీయం కదాపి.

పాదుషా: ఏం కావాలంటాడు?

పండిత: (లవంగిని చూపిస్తూ).

ఇయం సుస్తనీ మస్తకన్యస్తకుంభా,

కుసుంభారుణం చారుచేలం వసానా...

అబుల్: (తల పంకించి) కవిరాజ్! హిందువులు మిమ్మల్ని వెలిచేస్తారు.

పండిత: నహి యాచే హిందూకం

సర్వాణి దత్తె తామ్రమడబ్బూకం.

అబుల్: అయితే?

పండిత: (చేయి చాచి)

యాచే మొగల్మలూకం,

తృణీకృతస్వర్గ దంమూకం.

పాదుషా: (పండితరాజుతో) నీ కోరిక గనసర్చి.

పండిత: (నవ్వుచు) ఢిల్లీ పాదుషా కల్పవృక్షమని ప్రతీతి.

ఢిల్లీశ్వరోవా జగదీశ్వరోవా

మనోరథాన్ పూరయితుం సమర్థః

అన్యైర్నృపాలైః పరిదీయమానం

శాకాయ వాస్యా ల్లవణాయ వా

పాదుషా: శబాస్! [సాత్.

అబుల్: వహా వ్వా! కవిసామ్రాట్! లవంగి ఒప్పదమైతే పాదుషావారు మీ కోరిక నుక్షణంలో తీరుస్తారు.

[పండితరాజు లవంగిపై చూడ్కులు నిగుడిస్తాడు.]

లవంగి: (సిగ్గుతో) ఈ మహోజ్వల మూర్తి పూర్వజన్మలో మజనూ, జహాపనా.

పండిత: ఈ సురలోకసుందరి లైలా ప్రభూ!

అబుల్: చిలకా గోరింకల ఈ జోడీ ప్రేమికుల స్మృతిపథంలో కలకాలం జీవించుగాక!

పాదుషా: (ఇద్దరి చేతులూ కలుపుతాడు)

తెర పడుతుంది

★

# పలకరించిన ప్రకృతి

## కె. జానకిరామ్ పట్నాయక్

నరహరి వివాహం సంగతి ఆ వూరంతా అల్లుకుపోయింది! విన్నవాళ్లంతా విస్తుపోయారు! ఎవరినోట విన్నా "నరహరికి పెళ్లిటకి!" అన్నమాట తప్పించి వేరే లేదు.

నరహరికి పెద్ద చదువులేదు మంచి సంస్కారం లేదు. అందం లేదు ఆస్థి లేదు ఇన్నీ లేనివానికి ఈ రోజుల్లో ఎవరు పిల్లనిస్తారు?. అందుకే అతనికి వివాహం అనేసరికి అందరూ అంతగా ఆశ్చర్యపోయారు!

మురహరి మాత్రం తమ్మునికి ఇరవయ్యో యేడు వచ్చిందనేసరికి సంబంధాలకోసం గాలించాడు ఏదో తమకు తగ్గది దొరకదా అని ఆశించాడు కాని నాలుగు సంవత్సరాల ప్రయత్నమూ వృథా అయిపోయింది!

అయితే తలవని తలంపుగా పక్కవూరి నుంచి యశోదమ్మ పంపిన పేరయ్యవచ్చి మురహరితో నాలుగు మాటలూ ఆడినాడు—

"మురహరి గారూ! మీ తమ్ముడు విషయంలో యశోదమ్మకు అన్ని సంగతులూ తెలుసు ఆమెకు కావల్సిందంతా సాంప్రదాయం! ఆమీద యీడు జోడూ, సద్గుణాలూన్ను!..అంతే! మిగిలినవాటితో ఆమెకు ప్రమేయం లేదు. ఇంతకూ ఆమె కెవరున్నారని? ముగ్గురాడపిల్లల కిదివరకే పెళ్లిళ్ళయిపోయి, వాళ్ళ బతుకులు వాళ్లు హాయిగా బతుకుతున్నారు. నాలుగోది యీ పిల్ల! దీన్ని బయటికి పంపివేసే ఉద్దేశమే ఉంటే మూడేళ్లక్రితమే ముడిపడిపోయి ఉన్ను! కాని ఆవిడకా అభిప్రాయం లేదు దేవుడిచ్చిన మట్టూ ఏదో యింత వసతి ఉంది! . పదెకరాల పల్లం, ఆరెకరాల నల్లరేగడి మెట్టూ, ఐదువేలు రొఖ్ఖం ఆస్తీ, మూడు గదుల పెంకుటిల్లూ, నాలుగు గదుల పూరిల్లూ, బండీ, బక్కా మొత్తం మీద అనుకోవాల్సొస్తే పూటైన సంసారమే! దిన్నింటినీ ఆమె నెత్తిని పెట్టుకు పోగుకదా? ఇప్పటికప్పుడే అరవయ్యో పడి వచ్చింది! ఏదో పూర్వపు మనిషి గనక కాస్త పటుత్వంగా ఉంది! కాని యీ బతుకులకెంతకాని? .. ఇవ్వాళ ఉన్నవాడు మళ్లీ గడియకు కనిపించకుండా పోతున్నాడు!...అందుకని ఆ పిల్లను ఒకయ్య చేతిలో ఉంచి, వాళ్లమీద ఈ సంసారం వదిలి 'కృష్ణా రామా' అనుకుంటూ కాలం గడిపేద్దామని ఆమె ఉద్దేశం!

అయితే యింతకాలమూ ఆమెకు నచ్చిన మొగాడు దొరకలేదు. నాలుగూ కలిగినవాడైతే తగిన యోగ్యత తీసుకోడని, కాస్త లేమింటి పిల్లాడూ, బుద్ధిమంతుడూ కోసం తాపత్రయపడ్డది. బాగునే మీ తమ్ముడున్నాడని విన్నది ఇష్టపడిపోయింది.."

పేరయ్య చెప్పిన మాటలు విని మురహరి లోలోపల గొప్పగా ఆనందించాడు. బయటికిమాత్రం కాస్త బెట్టు చూపించి "అంతా బాగానే ఉంది . కానీ.. ఇల్లరికం అనేసే కాస్త—"

మాట పూర్తికానివ్వకుండానే పేరయ్య అందుకున్నాడు. "అబ్బే! అదేం వన్నా మాట? పేరుకుమాత్రం యిల్లరికం! కాని ఆ యింటి సర్వాధికారాలూ మీవాడివే! అయినా ఆ అబ్బాయిమీద అజమాయిషీ చేయడానికెం కెవరున్నారు? ఉన్న ఆ యిద్దరూ ఆడవాళ్లు! ఒకరు అత్త, రెండోది భార్య! ..కాగా ఇంకోమాట! ఆ ముసల్ది పడిపోయాక ఆస్తిపాస్తులంతా మీ వాడి పేర రాసేస్తారు, మీరు మరోలా అనుకోకుండా 'ఊఁ' అంటూ, ఆవిడతో చెప్పి ముహూర్తం నిశ్చయపరుస్తాను!. మరో ముఖ్యవిషయం!.. పెళ్ళిలో ఉభయ ఖర్చులూ ఆవిడవే!...ఆలస్యం చెయ్యకండి!" అన్నాడు.

చిరునవ్వుతో మురహరి తల వూపాడు. పేరయ్య వెళిపోయాడు.

ఆ దే నెలలో యశోదమ్మ అన్ని ఖర్చులూ పెట్టుకొని నరహరినీ లేబీనీ ఒక సూత్రంలో బంధించివేసింది! .

* * *

పదిహేను రోజుల వరకూ నరహరికి అత్తవారింట్లో బాగా మర్యాదలు జరిగాయి! కాని యీ వ్యవధిలో ఒకసారయినా భార్యదర్శనం లభించింది కాదు!

ఒకనాటి మధ్యాహ్నం అమ్మలక్కలు నలుగురూ చేరి యశోదమ్మ యింట్లో పురాణం వేశారు. మాటల సందర్భంలో లేబీ విషయం వచ్చింది—

"యశోదమ్మా! ఎంతదైనా యిలాంటి సమ్మంధం గాలించి తెచ్చావేమిటమ్మా, లోకం గొడ్డుపోయినట్టు?" అన్నది ఒకావిడ!

"ఏమయిందేమిటి?" అన్నది యింకో యిల్లాలు ఏమీ తెలీనట్టు.

"ఉత్తి బడుద్దాయి సంబంధమమ్మా!"

"బడుద్ధాయి సమ్మంధం కాదు గాని...ఆ అల్లుడికి రూపురేఖ లేనేలేక సరికదా చదువూ సంధ్యా ఉన్నట్టయినా లేదు."

"ఏదో ప్రయిమరీ పాస్యాడటగా?"

"ఇంతకూ లేబీ యిష్టపడ్డదా అని?"

"తల్లి ఇష్టపడ్డప్పుడు లేబీ ఇష్టపడితే యేం! లేకపోతే యేం."

"ఇంతకూ ఋణానుబంధమమ్మా! ఎంతనుకుంటే ఏం లాభం?"

యశోదమ్మ ఎవరికీ ఏమీ జవాబివ్వలేదు. కాని మనసులోమాత్రం మథనపడిపోయింది— "నిజమే! ఇల్లరికాని కెవరూ ఒప్పుకోరని యీ దరిద్రుణ్ణి యింటిమీదకు తెచ్చుకున్నాను. పిల్లదాని గొంతుకు తెగని కత్తితో కోసివేశాను—

లేబీకి పెళ్ళినాటికి పదహారు వెళ్ళి పదిహేడేళ్లొచ్చాయ్. పెద్ద నాగరికతా, చదువూ లేకపోయినా, సంసార పక్షానికి కావల్సిన శిక్షణ వుంది!...కాని ఆమెకు నరహరి పొడ అంటే సుతరామూ కిట్టలేదు. బావలు ముగ్గురూ పట్నవాసస్థులు! నాగరికులు! ఉద్యోగస్థులు! ...తనూ అలాంటి పట్నవాసస్థుణ్ణే పెళ్లాడి సర్దా దలాయిస్తాననుకొని గాలిలో మేడలు కట్టింది! కాని అనుకోకుండా ఆ మేడలు ఒక్కసారిగా కూలిపోయాయ్! ఆశలన్నీ నాశనమై పోయాయ్! చెప్పుకోలేని వ్యథలో పడిపోయింది!...దాంతో ఆమెలోని ప్రకృతి మూగపోయింది!

నరహరికి అత్తగారి అంతస్థూ, భార్య జడ ప్రకృతీ క్రమక్రమంగా అవగాహనకొచ్చాయి. కాని యేం చేస్తాడు? ఉక్కున పేనులా ఉండిపోయాడు!

నెలరోజులు దాటిందో లేదో యావత్తు వ్యవసాయపు పనులూ నరహరి నెత్తిన పడ్డాయి. కోడి కూసిందీ అనేసరికి భుజం

# ★ పలకరించిన ప్రకృతి ★

మీద నాగలీ, ఎదురుగా యెద్దుల జతా, చేతిని చద్దిమూటతో పొలానికి పోతాడు. తిరుగా రెండుగంటల కొస్తాడు. అప్పటికి అత్తగారూ, భార్యా భోజనాలు కానిచ్చేసుకొని నిద్రపోతూండడమో, పొరుగు పెత్తనాలు పెత్తిని వేసుకొనేందుకు పోవడమో చేస్తుంటారు! ఎప్పుడో వాసరాటు తప్పితే నేగాని లేకపోతే సామాన్యంగా నరహరే వడ్డించుకు తింటుంటాడు. రాత్రి వేళ మాత్రం తప్పని సరిగా యశోదమ్మ యింత ముద్ద వేసేస్తుంటుంది. బేబీ మాటవరసకైనా గ్లాసెడు మంచినీళ్లందించిన పాపాన పోలేదు!

నరహరి అనాగరికుడే! అశిక్షితుడే! అస్వతంత్రుడే! అనాకారే!...కాని యువకుడు! పాతికేళ్ల యవ్వనం మిసమిసలాడుతూ అతనిలో పెల్లుబుకుతున్నది! ఆ హృదయంలో కోరికలు ఉవ్వెత్తున లేచిపడుతున్నవి!......అయితే యేం లాభం?...తన స్థితి ఎవరు గమనిస్తారు?... తనకూ, ఆ యింట్లో వున్న పాలికాపుకూ భేదం లేదు. కాదు కాదు......ఆ పాలికాపుతో బేబీ మాటాడుతున్నది! గసురుకొంటున్నది!... అప్పటప్పటా నవ్వుతూ పరాచికాలాడుతున్నది!...కాని తనపట్ల మాత్రం?...కన్నెత్తిమూడనైనా చూడదు!

ఐదారుసార్లు బేబీ ఒంటరిగా ఉండటం గమనించి నరహరి పలకరించాడు. కాని జవాబు దొరకలేదు. ఒకనాడు సాహసించి ఆమె తోవ కడ్డంగా నిల్చుని "బేబీ! కాస్త మంచినీళ్లియ్యవూ?" అని అడిగాడు. ఆమె మాటాడలేదు. తప్పుకోబోయింది. నరహరి అడ్డుకొని "మాటాడితే ముత్యాలు రాలిపోతాయా?" అన్నాడు నవ్వుతూ! ఆమె జవాబివ్వలేదు! నిల్చుండిపోయింది.

"ఏం బేబీ! నీళ్ళివ్వవూ?" అన్నాడు నరహరి. కాస్త ముందుకు వెళ్లి.

"వెళ్లి తీసుకోరాదూ?" బేబీ అన్నది కోపంగా, అతని వేపు చూడకుండానే!

"అబ్బ!...ఎలానో మాటాడేవ్?"... అంతే చాలు!...కాని నీ చేత్తో కాసిని నీళ్ళిస్తే—" అన్నాడు అడ్డంగా నిల్చుని!

"తోవ యిస్తే పోతాను!" అన్నది బేబీ చిరాగ్గా.

"ఊఁహూఁ! నీళ్లిస్తేనే తోవ యిచ్చేది!" అని నరహరి చేతులు బార చాచాడు.

"ఓ యమ్మో! పరాగం ముదురుతుందే! ...తోవ యివ్వకపోతే అమ్మను కేక వేస్తాను" అన్నది అదే స్వరంతో!

నరహరి పక్కకు తప్పుకొని "పోనీలే! ఏదో యీ పాటయినా మాటాడేవ్!" అన్నాడు దీనంగా చూస్తూ!

అనుకోకుండానే బేబీకూడ నరహరి వేపు చూసింది. అతని కళ్లల్లోనూ, ముఖంలోనూ, ఆమె ఏం గమనించిందో కాని పది సెకండ్ల కాలం అలా చూస్తూ ఉండిపోయింది! తరువాత తల వంచుకొని విసవిస నడిచిపోయింది!

ఆమాత్రం దానికే నరహరి స్వర్గం దొరికినట్టు పొంగిపోయాడు. బేబీకి తనమీద ప్రేమ వుందనీ, తల్లి పడనివ్వడం లేదనీ అనుకున్నాడు! ఏనాటికైనా బేబీ తనకు కాకపోదని ఆశ పెట్టుకున్నాడు.

తదాది ప్రతి రాత్రీ అతను చాలవరకు మేలుకొని ఉంటున్నాడు. ఏదో అజ్ఞాత వాణి చెవిలో "ఈ రాత్రి గొప్ప వింత జరుగుతుంది......ఆ ముసల్ది నిద్రపోయాక... గది తలుపులు నిశ్శబ్దంగా విడిపోతవి ...ఊపిరి బిగబట్టుకుంటూ...... బరువైన అడుగుల్తో...ఒక వ్యక్తి వస్తుంది.. మెల్ల మెల్లగా...నీ పక్కకు చేరుకుంటుంది...చేరుకొని .... చేరుకొని..." గుసగుసలాడుతున్నట్టు అతను ఊహిస్తూండేవాడు. ఆ మధుర సంఘటనకోసం, ఆ సుఖానుభూతికోసం, ఆ ప్రకృతి పలకరింపు కోసం ఆశతో, ఆకలితో, అభిలాషతో ద్వారంవేపు రెప్పవాల్చకుండా చూస్తూ, చూస్తూ తెల్లవార్చేస్తున్నాడు! కాని—ఏనాటికీ ఆ యాశ, ఆకలి, అభిలాష తీరటం కనిపించలేదు! అతనిలో ఓర్పూ, శాంతమూ రోజు రోజుకూ కరిగిపోసాగినయ్! అణగారి వున్న విప్లవశక్తి మెల్ల మెల్లగా తలచూపనారంభించింది.

* * *

ఒకనాటి మధ్యాహ్నం పొలంనుంచి భోజనానికి నరహరి యింటికి వచ్చాడు. బయట వరండాలో తన మామో వృద్ధుడూ కూచొని ఉన్నాడు. అతనికి ఎదురుగా అత్తా, పక్కను భార్యా ఉన్నారు. ఏవో కబుర్లాడుతూ నవ్వుకుంటున్నారు.

బేబీ, బావను అంటిపెట్టుకొని కూర్చుని ఉల్లాసంగా ఉండటంచూసి నరహరి క్రోధంతో పిచ్చివాడయిపోయాడు. అతనిలో పౌరుషశక్తి ఒక్కసారి విజృంభించింది. రెండడుగుల్లో వరండా సమీపించి "బేబీ! అక్కణ్ణుంచి లేస్తావా? లేక దుమ్ములు విరగతిన్నమన్నావా?...పరాయి మగాణ్ణి అలా అంటిపెట్టుకు కూచోటానికి సిగ్గులేదూ?" అని గర్జించాడు.

ఆ కోపమూ ఆకారమూ చూడ్డాని కదే తొలిసారి యేమో నిజంగా బేబీ హడలెత్తిపోయింది. లేచి మెల్లిగా యింట్లోకి జారుకుంది. కాని ఆ పట్నవాసపు పెద్దకుడు అత్తగారి ఆసరా, నరహరి పరిస్థితీ చూసుకొని "బేబీ! ఇలా వచ్చి కూచో! ఏ జేం చేస్తాడో చూస్తాను!" అన్నాడు గంభీరంగా!

"చూడాలని ఉంటే ఇలారా! ఒక గుద్దుతో మంచినీళ్ళడక్కుండా నీ తాతల్ని కలుసుకు నేట్టు చేస్తాను!...మగతనంవుంటే అరుగు దిగిరా!" అని కట్టుకున్న పంచ ఎగగట్టి ముందుకు రెండడుగులు వేశాడు నరహరి.

అతని మాటల్లోని పటుత్వాన్నీ భయంకరమైన రూపాన్నీ గమనించి ఆ ప్రగల్భాలరాయుడు నోటమాట లేకుండా లోనికిపోతున్న అత్తగారి వెనక పడ్డాడు! నరహరి వచ్చిన తోవనే వెళ్ళిపోయాడు.

బావగారి వైఖరి, పొలానికి పోతున్న నరహరినీ చూసి బేబీ ఏమనుకున్నదో, సన్నగా నవ్వి వూరుకుంది.

ఆ సాయంత్రం ఆ నాగరీకుడు పట్నానికి ప్రయాణం కట్టాడు. వెళ్లిపోయే ముందు అత్తగారితో నాలుగు మాటలూ ఖచ్చితంగా చెళ్లబలికాడు—

"ఈ పశువును బేబీకి అంటకట్టవద్దని మేమెంత మొత్తుకున్నా విన్నారుకారు. అందుకనే వివాహానికి మేమెవరమూ రాలేదు. అయినప్పటికీ మీరు మీపని చేసివేశారు... ఇల్లరికం ఉంటాడని మహా పుబలాటపడిపోయారు!...వీడు ఒట్టి మూర్ఖుడు! పశువు! దుర్మార్గుడు! ద్రోహి!...ఈ ఆస్తిపాస్తీ చేజిక్కించుకొనేవరకూ పిల్లిలా నక్కి ఉంటాడు! తరువాత గొంతుముడి కొత్తికి ప్రాణాలు తీసేస్తాడు!...నా మాట వినండి! ఇప్పుడైనా ఏమీ మించిపోలేదు! వీలయినంత త్వరలో వీణ్ణి సాగనంపితే తరువాత సంగతి ఆలోచించుకుందాం!"

ఆ మాటలన్నిటినీ యశోదమ్మ శాంతగా విని, తలూపి యిలా అన్నది—

"నువ్వన్నది నిజమే నాయనా!......

లేలేక గోతిలో పడ్డాం! కూసను పెంచితే గండవుతుం దనుకోలేదు. బుద్ధి పొరపాటున యీ తద్దినం కొని నెత్తిని పెట్టుకున్నాం!.. నువ్వన్నట్టు ఇప్పుడైనా యేమీ మిగిలి పోలేదు. అందుకనే ఆ రాతకోతలు జరిపించలేదు. మొదటినుంచీ వీడంటే బేబీకి యిష్టం లేదు. ఏదో నామీదున్న భయభక్తులు కొద్దీ యిలాగైనా వుంటున్నది. లేకపోతే అనాడే మనువు తెంచేసుకుపోయివున్ను!... సరే! ముందుగా వాడు తర్లిపోనీ! పై విషయాలు తరువాత చూసుకుందాం!"

ఈ సంభాషణ అంతా బేబీ విన్నది. దాంట్లో ఏమీ జోక్యం కలిగించుకోలేదు.

ఆనాటినుంచీ యశోదమ్మ నరహరితో మాట్లాడ్డం పూర్తిగా మానేసింది. మునపటికన్నా నీచంగా చూడ్డం మొదలు పెట్టింది. బేబీని అతని చూపు మేరల్లోనికి పోనివ్వడం లేదు.

ఈ దుర్వ్యవహారం, నరహరిలో ఉన్న కాస్త సహనాన్నీ ఖూనీ చేసి, పౌరుషాన్ని పూర్తిగా రెచ్చగొట్టింది!

'కేవలం పొట్టకోసం యిలాంటి నరకం అనుభవించాలీ అంటే కావల్సినంత లోకం ఉంది!' అనుకుంటూ నరహరి, అత్తగారు ఉద్వాసన చెప్పకముందే వెళ్ళిపో నిశ్చయించుకున్నాడు.

మూడోనాటి సాయంత్రం ఆమెతో ప్రసంగించాడు—

"నేను మా వూరు వెళ్ళిపోతాను!"

యశోదమ్మ జవాబివ్వలేదు.

"బేబీని తీసుకుపోతాను!"

"వీలుపడదు!" ముఖం తిప్పుకొని కటువుగా అన్నది.

"ఎందుకు?"

"ఎందుకేమిటి? నా యిష్టం!"

"మీ యిష్టా యిష్టాలు పెళ్ళినాడే తీరిపోయాయ్! ఇప్పుడు నా యిష్టం!"

"నీ యిష్టాన్ని నీదగ్గరే వుంచుకో!"

"సరే! రాసిస్తామన్న ఆస్తిసంగతేమంటారు?"

"నీకా?...ఏ మాస్తి?"

"పెళ్ళినాడిస్తామన్నది!"

"పూరిపుల్లయినా యిచ్చేదిలేదు!"

"మీ కిది న్యాయంగా కనిపిస్తుందా?"

"న్యాయం, అన్యాయం తరవాత మాట! నా కిష్టంలేదు! ఇవ్వను! మా పెట్టుపోతల్లో ఉండాలంటే ఉండు!...లేకపోతే ఎటు పోతావో పో!"

"మీరా మాటనక్కర్లేదు. నాకు నేనె వెళ్ళిపోతానని చెప్పటానికే వచ్చాను! కాని బేబీనిమాత్రం తీసుకుపోతాను."

"అది వీలుపడదని యిదివరకే చెప్పాను!"

"బేబీ వస్తానంటే?"

"బేబీయా?... వస్తానంటుందా?... నీతోనా?...చాల్చాలు! ఇక వెళ్లు!"

నరహరి జవాబివ్వలేదు. నట్టింటి ద్వారంవద్దనుంచి అంతా వింటున్న బేబీ వేపు చూశాడు. బేబీకూడ అతనివేపు చూసింది. ఆ చూపుల్లో ఏదో వింత అనుభూతి గోచరించింది. లేచి బయటికి వెళ్ళిపోయాడు!

రెండురోజులు యథాప్రకారం గడిచిపోయింది. ఏదైనా కొత్తసంఘటన ఘటిస్తుందని ఆశిస్తున్న నరహరికి పూర్తిగా నిరాశ కలిగింది! దాంతో అతను అక్కణ్ణుంచి శాశ్వతంగా తప్పుకో నిశ్చయించాడు!.... కాని వెళ్ళిపోయేముందు ఎలాగైనా బేబీతో ఒంటరిగా కలిసి, ఒకటి రెండు మాటలాడి మరీ పోదామనుకున్నాడు.

# ★ పలకరించిన ప్రకృతి ★

ఆనాటి రాత్రి అతనికి నిద్రపట్టలేదు. సమయంకోసం కాచుక్కూచున్నాడు.

పెరటి తలుపు తీసిన శబ్దమైంది. వెంటనే అతడు లేచి మెల్ల మెల్లగా అడుగులు వేసుకుంటూ అటువేపు వెళ్ళాడు. అత్తగారు లాంతరూ, చెంబూ పట్టుకొని పెరటివేపు పోతూండడం గమనించి అతను ఆ గదిలో దూరి లోనుండి గడియ వేశాడు.

బేబీ మెలకువగా ఉంది. గడియ చప్పుడు విని "అమ్మా!" అని కేక వేసింది. నరహరి చప్పున బేబీదగ్గరకు వెళ్ళి "కేకలు వెయ్యకు బేబీ! నేను నరహరిని! నిన్నేమీ చెయ్యను! రెండు మాటలు చెప్పిపోదామని వచ్చాను! కాస్త ఓపికపట్టి విను! తరవాత వెళ్ళిపోతాను!...మరి యీ జన్మలో మీ గడప తొక్కను!" అన్నాడు. బేబీ ఏమీ అనలేదు!

కొంతసేపటికి యశోదమ్మ వచ్చింది. తలుపుతోసింది. లోపల గడియ వేసివుండటం గమనించింది. "బేబీ! తలుపు తియ్యమ్మా!" అని పిల్చింది.

లోనుంచి జవాబు రాలేదు.

'నిద్ర పట్టిపోయిందేమో! అంగటినుంచి పిలిస్తే పిలుపు వేగిరం అందుతుంది' అనుకుంటూ ఆమె అటువేపు వెళ్ళి తలుపుమీద చేయివేస్తూ, నరహరి పరున్న కొట్టుగదిలోకి తొంగిచూసింది. నరహరి లేడు. పక్కమాత్రం పరిచింది పరిచినట్టే ఉంది!

యశోదమ్మకు అనుమానం వేసింది. గబగబ తలుపుమీద కొడుతూ, "బేబీ! బేబీ!" అని పిల్చింది.

లోనుంచి జవాబు రాలేదు.

కాస్త స్వరం హెచ్చించి "తలుపు తియ్యవే బేబీ!" అంటూ దబదబబాదింది.

లోనుంచి జవాబు రాలేదు.

దానితో ఆమె బేజారెత్తిపోయింది. నరహరి లోపలప్రవేశించి బేబీని గొంతు నులిమి చంపివేస్తున్నాడేమో అన్న అనుమానం ఆమెకు కలిగి యేడుపు లంకించుకుంది. తలుపుమీద బాదుతూ" అయ్యో కూతురా! నా తల్లీ! పలకవేమే అమ్మా!"అని రాగాలు తీయనారంభించింది.

అంతలో 'ధడాల్' మనే శబ్దంతో గడియ తీసి, తలుపు సగం తెరిచి తోవకడ్డంగా బేబీ నిల్చొని "అర్ధరాత్రప్పుడు యీ గోల ఏమిటమ్మా! ఎవరైనా వింటే నవ్విపోతా రన్నది కూడా లేదా!...... అయినా యింత వయసొచ్చిందన్నమాటే గాని లోకజ్ఞానం పిసరంతయినా లేదమ్మ నీకు!" అన్నది.

"బతికే వున్నావా నా తల్లీ!......నా [illegible]!" అని దీర్ఘంగా రాగంతీసింది యశోదమ్మ.

"ఎవరకే!" అన్నది బేబీ నవ్వుతూ!

"వాడే నే...నరహరి!"

"వారితో నీకేం పని?" సన్నగా

నవ్వుతూ ఎదురు ప్రశ్న వేసింది బేబీ!

"ఇదేమిటే యీ విడ్డూరం? అడిగిన దానికి జవాబివ్వకుండా ఈ అడ్డుప్రశ్న లేమిటే?"

"విడ్డూరాని కేముందండీ అత్తగారూ?.. మీరు యివాళ్టినుంచీ ఆ కొట్టుగదిలో హాయిగా "కృష్ణా, రామా" అనుకొంటూ ఉండండి!" అన్నాడు నరహరి, బేబీ భుజం మీద చేయివేసి!

"ఆఁ?" అంటూ యశోదమ్మ నోరావలించుకుంటూ ఒక గడియ నిల్చుండిపోయింది.

తరువాత "అలాగే నాయనా! అలాగే" అంటూ కొట్టుగది వేపు తోవతీసింది.

తలుపుపడ్డ శబ్దమూ, గడియ వేసిన చప్పుడూ, వెనువెంటనే బేబీ నరహరుల నవ్వులూ వింటూ యశోదమ్మ పక్కమీదకు చేరుకుంది.





వచ్చేశాయ్ విచ్చేశాయ్
జగన్నాథ జగన్నాథ
జగన్నాథుని రథచక్రాల్. (శ్రీశ్రీ)

(పూరీ జగన్నాథ రథయాత్ర—ఫొటో : వి. రామచంద్రరావు—బరంపురం.)

సీరియల్

# ఉదయ కిరణాలు

పోతుకూచి సాంబశివరావు

## 16

ప్రకాశం తీసుకున్న అద్దె యింట్లో ఒక గది, ఒక వంటిల్లు, ఒక వరండా ఉన్నాయి. మట్టినేల; పైన పెంకుల కప్పు - బాగా క్రిందకు వంగిపోయిన చూరు. వరండా కెదురుగా ఒక పాత నుయ్యి - ఆ యింటికి ఒకవైపున ఒక పంతులమ్మ, మరొకవైపున ఇంటి యజమానులు నివసిస్తున్నారు.

పంతులమ్మకు ఆమె తల్లి ఒక్కర్తే తోడు. ఇంటి యజమానికి భార్యలేదు. పెద్దకూతురు, ఇల్లరికం ఉంటున్న అల్లుడు, చిన్నకూతురు - వీళ్ళే కుటుంబం. పంతులమ్మ పచ్చగా ఉంటుంది. చాకింటి మడత చీరలతో ఎప్పుడూ పరిశుభ్రంగా ఉంటుంది.

అద్దెకొంపలో ప్రవేశించేక, ప్రకాశానికి పరిసర ప్రాంతాలు అనుకున్నంత తృప్తిగా లేవు. ఫర్లాంగు దూరంలో చేపల బజారు - మాంసం అమ్మే అంగడి - సినిమా థియేటరు ఉన్నాయి. జనం ప్రవాహంలా ఎడతెరిపిలేకుండా రాత్రి ఒంటిగంటవరకు ఏదో పనిమీద రోడ్లమీద నడుస్తూనే ఉంటారు. తన అద్దెభాగం వీధివైపు ఉండడంవల్ల రోడ్డుమీది గడబిడ అంతా ఇంట్లో జరిగినట్టే ఉంటుంది. సినిమాకి వెళ్ళివచ్చే జనం హడావిడి, కేకలు - ఒంటిగంటదాకా దుకాణాల్లో వెలిగే లైట్లు - ఆ వీధి సందడిగా ఉంటుంది. ఇంటి వెనక ఒక మురికికాలువ, దాన్నిబట్టి దోమల బాధ.

ముందు గదిలో ఒంటరిగా పడుకున్న ప్రకాశాన్ని 'కులాసాగా నిద్రపోతున్నావా' అని పరామర్శ చేస్తున్నట్లు చిట్టెలుకలు చెవిదగ్గర కిచకిచలాడి, ప్రకాశం కదలగానే, తుర్రుమని పారిపోతున్నాయి. చిట్టెలుకలపై వేటచేస్తూన్న పిల్లులు రెండు పోటీలో కొట్లాడుకుంటూ యింట్లో గందరగోళం చేస్తున్నాయి. నల్లిసమూహాలు మంచాలనంటి, అతడి శరీరంలో దాగుడుమూత లాడుతున్నాయి. రాత్రి సరిగా నిద్ర లేదు. వీటికితోడు ఇల్లరికపుటల్లుడు మద్దెల వాయిద్యంలో కొంచెం చెయ్యి తిరిగినవాడు. హరికథలు, సంగీత కచేరీలు, భరతనాట్యాలు, మొదలైన సందర్భాల్లో అతడు తరుచు కనిపిస్తూంటాడు. పగలు ఊరంతా తిరిగి తిరిగివచ్చి, రాత్రి భోజనం చేసి, మద్దెల వాయిద్యం సాధనచేసేవాడు. బావగారికి తోడుగా, మరదలు వీలైనప్పుడల్లా హార్మనీ మొదలుపెట్టేది. అటువైపున పంతులమ్మ పగల్లా ఉద్యోగంచేసి వచ్చి బడలికనుంచి తేరుకుందుకు రేడియో త్రిప్పి ఇంగ్లీషు మ్యూజిక్ - సిలన్‌నుంచి వచ్చే హిందీ పాటలు నిత్యమూ వినేది. ఇంటి ప్రక్క జరుగుతున్న యీ సంగీత కార్యక్రమాలతో రాత్రి చదువు సాగక ప్రకాశం చికాకుతో పుస్తకాలు మూసేసేవాడు.

పగలల్లా, వీలైతే రాత్రిళ్ళు కూడా మాణిక్యందగ్గర కూర్చుని ఇంటియజమానిపెద్ద కూతురు ఏవో పనికిరాని కబుర్లు చెబుతూండేది. ఇతరుల గొడవల్లో కలగజేసుకోవాలనే ఆసక్తి లేకపోయినా, విరామకాలం ఏదో విధంగా గడపడానికి ఆమెని ఇంట్లోకి రానిచ్చేది మాణిక్యం. మొదటి రోజుల్లో దూరదూరంగా వున్నా, క్రమంగా పంతులమ్మ కూడా తీరిక వేళ మాణిక్యంవద్దకు వచ్చి కూర్చునేది. రాత్రిళ్ళు చదువుకుందామని కూచునేసరికి, వంటింట్లో లోకాభిరామాయణం ప్రకాశానికి తలనొప్పి పుట్టించేది. అక్కడికీ రాత్రిళ్లు కబుర్లు పెట్టవద్దని ప్రకాశం తల్లితో చాలసార్లుచెప్పాడు. 'వాళ్లు వస్తోంటే పొమ్మని ఎల్లా అననురా?' అని తల్లి అనేది. ఇటు తల్లిని గట్టిగా ఏమీ అనలేక, అటు పొరుగింటివారిని ఏమీ అనలేక, తన చదువు సాగడంలేదని చిరాకుపడేవాడు ప్రకాశం. సంసార బాధ్యతలు, అద్దెకొంపలో అల్లరి - రాధమ్మను చూసేందుకు రోజూ ఆమె యింటికి వెళ్లడం - మొదలైనవాటితో ఉన్న కాస్త విరామకాలం హరించిపోయేది. కాలేజీలో ఏది వింటే దానిమీదే ఆధారపడి చదువు సాగించేవాడు ప్రకాశం.

ఆ అద్దెకొంపలో చేరాక సాంబు జీవితంలో పరిణామం వచ్చింది. పైకి అన్నగారికి, తల్లికి, భయపడుతున్నట్లు కనిపించినా, వాళ్లు ఎదురుగా లేనప్పుడు, సాంబు చేసే అల్లరి యింతా అంతా కాదు. సాంబు అప్పటికి అయిదవఫారంలోకి వచ్చాడు. ఒడ్డూ పొడుగూ ఆకారం పెరిగాయి. చదువులమీదకన్న ఆటల్లో ఆసక్తిమెండయింది. సాధారణంగా ప్రతీసంవత్సరం చెడుగుడు, హైజంప్, ఫుట్‌బాల్ ఆటల్లో వెండి కప్పులు, మెడల్సు సంపాదిస్తూనే వున్నాడు. అవి చూసి మాణిక్యం, మురిసిపోయేది. ప్రకాశం తమ్ముడి బహుమతులు చూసి సంతోషించినా, సరిగా చదవటం లేదనిమాత్రం లోపలఅనుకొనేవాడు. ఇంటి యజమాని రెండోకూతురుకూడా సాంబు స్కూల్లోనే అయిదవఫారంలోనే ఉంది. ఆ అద్దెకొంపకు వచ్చేక, సాంబుకు, ఆమెకు స్నేహం కలిసింది. స్కూలుకు సాధారణంగా కలిసే వెళ్లివచ్చేవారు. ఆమె సాంబు దగ్గరకు వచ్చి పుస్తకాలు నోట్సు, పట్టుకుపోతూండేది. సాంబుకూడా ఆమెను ఏదో సాకుమీద రోజూ కలుసుకుంటూనే వుంటాడు.

తన చదువులు, పనుల్లో నిమగ్నుడైన ప్రకాశానికి సాంబుప్రవర్తన సరిగ్గా తెలియడంలేదు. 'మీ తమ్ముడు క్లాసులో బాగా అల్లరిచేస్తున్నాడోయ్' అని తన్నెరిగిన టీచర్లు చెప్పితే, ఒక్కొక్కప్పుడు తమ్ముడిని కూకలేసేవాడు. కాని రోజులు గడుస్తూంటే సాంబుగురించి వింతకథలు కూడా వినసాగేడు. క్లాసులో ఒక అమ్మాయిని జడపట్టుకు లాగేడనీ, తెలుగుమేష్టారిని వెనకనుంచి అరటిపండు తొక్కతో కొట్టాడనీ, ఎవరో తోటివిద్యార్థిని ఆటల్లో మడమవేసి, కాలు విరగ్గొట్టేంత పనిచేశాడని, ఎవరో ఒక విద్యార్థిని పదిమందిలోనూ పట్టుకు కొట్టాడని ఇలా ప్రకాశానికి వార్తలు వస్తున్నాయి. అయినా కళ్ళతో చూడనివాటిగురించి ఖచ్చితంగా ప్రశ్నించలేకపోయాడు ప్రకాశం.

ఒకరోజు ప్రకాశం మనస్సు స్థిమితంలేక పరిస్థితులు పర్యాలోకన చేసుకుంటూ పార్కువైపు షికారువెళ్ళాడు. ఊరుచివర పార్కుకు ఎప్పుడో వీలైతే వెళ్లేవాడు. కాని ఆరోజు ఏదో ఆలోచిస్తూ, గడచినదూరం గుర్తులేక, ఎదురుగా కనిపించిన పార్కులో కూర్చున్నాడు. చల్లగాలి వీస్తోంది. రేడియో వార్తలు వినిపిస్తోంది. ప్రకాశం ఒకతిన్నెమీద కూర్చున్నాడు. జనం మసలుతున్నా, పార్కు చాలా ప్రశాంతంగా ఉంది. సాయంత్రం ఇక్కడ కూర్చుని చదువుకుంటే బాగుంటుందేమో అనుకున్నాడు. పార్కులో మూలగా ఏదైనా

తిన్నె చూసుకుని రోజూ అక్కడకు వచ్చి కూర్చుంటాడని నిశ్చయించుకున్నాడు.

ఏ స్థలం బాగుంటుందా అని పార్కు చుట్టూ పచార్లు ప్రారంభించాడు. దక్షిణ భాగాన గుబురుగా పెరిగిన పూలపొదలు వరుసగా ఉంటున్నాయి. పొదపొద మధ్య కొంతదారి ఉన్నా అక్కడ కూర్చున్న జనం, పార్కులోనివారికి కనిపించరు. పొదల మధ్య తిన్నెలుకూడా కనిపించేయి. ఈ స్థలం చాలా బాగుంటుం దనుకుంటూ లోపలికి నడిచాడు ప్రకాశం. ఎదురుగా కనిపించిన దృశ్యంచూసి నిశ్చేష్టుడై నిలబడిపోయాడు. తిన్నె మీద ఒకవైపున పుస్తకాలు పెట్టి సాంబు, అతని స్నేహితురాలు ఒకరినొకరు ఒరుసుకుంటూ కూర్చుని ఒకరికళ్లలోకి ఒకరు చూసుకుంటూ మాట్లాడుకుంటున్నారు. హఠాత్తుగా ప్రకాశాన్ని చూసి ఆమె గబుక్కున లేచి పుస్తకాలు అందుకుని లేచి తల వంచుకుని పొదప్రక్క నుంచి గబగబ నడిచి వెళ్ళిపోయింది. సాంబు నిర్ఘాంతపోయి కంగారుగా పార్కు పడమటి గేటువైపు పరుగెత్తాడు.

పదహారుసంవత్సరాలు నిండని సాంబు అప్పుడే శృంగారకలాపం కొనసాగించడం చూచి ఏమనుకోవాలో ప్రకాశానికి అర్థం కాలేదు. పద్దెనిమిది సంవత్సరాలు నిండుతున్నా తాను స్త్రీవైపు దృష్టి మరల్చ లేదు. పైగా స్త్రీ అంటే, అతనికి అదో విధమైన ఉపేక్షాభావం. వైరాగ్య తత్వం ఒంటబట్టించుకున్న ప్రకాశం సాధ్యమయి నంతవరకు స్త్రీకి దూరంగా వుండామని ప్రయత్నిస్తున్నాడు. సాంబును యింటి దగ్గర కేకలేద్దామనుకున్నాడు. ఒకవేళ తల్లికి యీవిషయం తెలిస్తే కొడుకు పాడై పోతున్నాడని బాధ పడుతుందేమో అని అనుమానించాడు. అందువల్ల ఒంటరిగా ఉన్నప్పుడు సాంబును కేకలేద్దామని వచ్చిన కోపం నిగ్రహించుకున్నాడు ప్రకాశం.

రాత్రి యింటికి వచ్చాక సాంబు, ప్రకాశం దృష్టిని పడకుండా తప్పుకుంటూ, దూర దూరంగా వున్నాడు. ప్రకాశం కూడా తమ్ముడిని కేకలేసే సమయం ఇది కాదని, చూసీ చూడనట్లు తన పనుల్లో నిమగ్నుడైయాడు. ఆకలి లేదంటూ, సాంబు ప్రకాశం పంక్తికి భోజనానికి రాలేదు. ఇది గమనించి ఊరుకున్నాడు ప్రకాశం.

అన్న తన్ను ఏవిధంగానూ కోపపడక పోడం సాంబుకు ఆశ్చర్యం కలిగించింది. కోపం ఎక్కువగా ఉన్నప్పుడు ప్రకాశం ఒక్కొక్కసారి ఊరుకుని మరొక సమయంలో ఆ కోపం వెళ్లగక్కడం సాంబుకు తెలుసు. బహుశా ఆ పద్ధతే అవలంబిస్తున్నాడు అన్న, అనుకున్నాడు సాంబు.

ప్రకాశం మరొకరోజు స్నేహితుల బలవంతంమీద సినిమాకు వెళ్లాడు. కొంచెం ఆలస్యంగా సినిమాకు వెళ్ళడంవల్ల, ఆట మొదలెట్టేశారు. స్నేహితులతో సరదాగా కబుర్లు చెబుతూ సినిమా చూస్తున్నాడు. ఇంటర్‌వెల్ లో లైట్లు వెలిగాయి. బయటికి వెళ్లి కాస్త చల్లగాలి పీలుద్దామని లేచాడు. వెనుక కుర్చీలలో సాంబు ఇంటి యజమాని చిన్న కూతురు కనిపించారు. సినిమా గురించి కాబోలు తీవ్రంగా చర్చించుకొంటు న్నారు. ప్రకాశం లోలోపల ఉబికే కోపం అణచుకుని బయటికి వచ్చేశాడు. సినిమానుంచి సాంబు కదలకపోడంవల్ల, తమ్ముడు తన్ను చూడలేదని భావించాడు.

ఎవరిదారిని వారు, ఇంటికి వచ్చేశారు. ప్రకాశం యింటికి వచ్చిన పదినిమిషాల తర్వాత సాంబు ఇంట్లో అడుగుపెట్టాడు. భోజనానికి మామూలుగా వచ్చేశాడు సాంబు.

'ఎక్కడికి వెళ్లావురా?' ప్రకాశం కోపంతో ముఖం చిట్లించాడు.

'స్నేహితులు రమ్మంటే, సినిమాకి వెళ్ళాను' వణికాడు సాంబు.

'ఆడ స్నేహితులా?'

సాంబు అన్న ముఖం చూసి కంగారు పడ్డాడు. తల్లి ఆశ్చర్యపోయింది.

'లే...దు' తడబడ్డాడు సాంబు సమాధానంలో.

'ఈసారి దాన్తో నువ్వు కన్పిస్తే ఒళ్లు హూనం చేస్తాను. నిన్నుగురించి అవధాని మామయ్యకు ఉత్తరం వ్రాస్తాను'

సాంబు తలదించుకున్నాడు.

'ఏమిటిరా సంగతి' అంటూనే మాణిక్యం సంగతి గ్రహించుకుంది.

సాంబు కూడా అనుమానపడ్డాడు, అన్న తన్ను సినిమాలో చూసిఉంటాడని.

అన్నదమ్ములిద్దరూ భోజనం చేస్తూ యింకేమీ ఘర్షణ పడలేదు. తాపీగా భోజనం ముగించి ఎవరి ప్రక్కలమీద వారు పడుకున్నారు.

మాణిక్యానికి సాంబు ప్రవర్తన బాధ కలిగించింది. ఇంత చిన్నతనంలోనే చెడి పోతున్న సాంబు ఎట్లా బాగుపడతాడా అని విచారించింది. ప్రకాశానికి, సాంబుకు అవధాని మామయ్య అంటే గౌరవమే కాక భయంకూడా ఉంది. ఇంకా సాంబు యీ విధంగా చెడిపోతున్నట్లు కనిపిస్తే, అవధాని చేత చివాట్లు పెట్టించడం ఒక్కటే మార్గ మనుకుంది మాణిక్యం. ఈ విషయం ఎవరికి తెలిసినా కుటుంబ ప్రతిష్ఠకు భంగమని, ఈ విషయాన్ని మాణిక్యం తన హృదయంలో రహస్యంగా దాచుకోవాలని నిశ్చయించు కుంది.

ఇవి చాలవన్నట్టు ఇల్లరికపుటల్లుడి భార్య, వంతులున్న తరుచు ప్రకాశంతో మాటలు కలపడానికి ప్రయత్నించేవారు. ఇదంతా చూస్తే ప్రకాశానికి విసుగూ విరక్తీ ఎక్కువైనాయి. ఇంక త్వరలో ఇల్లు మార్చెయ్యాలని నిశ్చయానికొచ్చాడు.

అప్పుడప్పుడు ఆదరించి సహాయంచేసే సోమయాజులుతో వైరం పెంచుకున్నాడు ప్రకాశం. అతనికున్న స్నేహితులంతా బాధ్యతలంటే ఏమిటో ఎరగని స్వేచ్ఛగా తిరిగే విద్యార్థులు. ఎవరిసహాయమూ లేక ఇల్లు మారుదామని ప్రకాశంచేసిన ప్రయత్నాలన్నీ విఫలమయ్యాయి.

ఈ పరిస్థితుల్లో అవధాని కాకినాడ వచ్చాడు. ఒంట్లో నలతగా ఉంటోందని నెలరోజులు సెలవు పెట్టాడు. ఆ సెలవు కాకినాడలోనే గడపవచ్చని తిన్నగా మాణిక్యంయింట్లో దిగాడు. అప్పటికే నాల్గుసంవత్సరాలనుంచి తనమీద ఆధారపడి ఉన్న మాణిక్యం కుటుంబంలో అవధాని అఱమఱికలేని కుటుంబపెద్దగా మసలుతున్నాడు.

అవధాని అనారోగ్యం చివరికి టైఫాయిడు జ్వరంలోకి దింపింది. డాక్టరు అన్నపూర్ణయ్యగారు కుటుంబవైద్యుడుగా చికిత్స చేశారు. ఇరవైఒక్క లంకణాలుచేసి పథ్యం పుచ్చుకున్నాడు అవధాని.

టైఫాయిడు జ్వరం పీల్చి పిప్పిచేసింది అతన్ని. నీరసంవల్ల అశక్తుడై, అవధాని తన సెలవు రెండునెలలు పొడిగించాడు. మందులు - చదువులకు జీతాలు - కుటుంబ పోషణకు - అవధాని తెచ్చే రెండువందలు చాలడంలేదు. ఒకపూట కూర వండితే, మరొకపూట పచ్చడితో భోజనం ముగించవలసివస్తోంది. బత్తాయిలు, టానిక్కులు, పళ్లు మొదలైనవాటికి మితిమీరినఖర్చయింది. పైగా జానెడు బెత్తెడు అద్దె కొంపలో హాయిగా కూర్చునే అవకాశంకూడా లేకపోయింది. రాత్రి దోమలు, నల్లులు, చీమలు, ఎలుకలు, పిల్లులు, పెట్టేబాధలు, చేసే రణగొణధ్వనులు చూసి ఎప్పుడు యీ కొంపఒదిలి ఒంటరిగా తెంకుపూరు పోదామా అనుకున్నాడు అవధాని. అవధానిపడ్డ చికాకు ప్రకాశం గమనించకపోలేదు. తన జీవితసౌఖ్యం, ధనంకూడా త్యాగం చేస్తున్న అవధానికి అవసరమైన సదుపాయాలు అతని అనారోగ్య పరిస్థితులలోనైనా కలుగచేయలేకపోయినందుకు ఎంతో నొచ్చుకున్నాడు. ఏ పెద్దలమాట సహాయం లేక, స్వశక్తితో కుటుంబాన్ని నడిపించుకుంటూ వస్తున్న ప్రకాశం తనకు వీలైనదంతా చేశాననిమాత్రం అనుకునేవాడు.

'ఈ వెధవకొంపతప్ప ఈ వూళ్లో మరో యిల్లే దొరకలేదుట్రా?'

'ఇచ్చిన రెండువందలూ అప్పుడే ఖర్చయి పోయాయిట్రా?'

'ఎవరైనా అనుభవించడానికి కూడా యోగం ఉండాలి'

ఇటువంటిమాటలు అవధాని నోటినుంచి వస్తున్నప్పుడు ప్రకాశం చాలా బాధపడేవాడు; తనతోపాటు అవధానికికూడా సుఖంలేదని. చిరాకులో అవధాని అన్న మాటలు హృదయానికి అంత ఎక్కువ పట్టించుకోకపోయినా, ఆ అద్దెకొంపలోంచి పోవాలనిమాత్రం నిశ్చయించుకొన్నాడు ప్రకాశం.

మాణిక్యం అద్దెయింట్లోకి వెళ్లిపోయాక, మునుపటి సంరక్షణకూడా లేక మనోవ్యాకులత పెరిగి, పూర్తిగా భోజనం మానేసింది రాధమ్మ. ఇంట్లో ఏంవుంటే అది తింటూ, కనిపించినవస్తువు డబ్బున్నప్పుడు కొనుక్కుంటూ, ఆ వీధిలో కనిపించిన వాడిని అస్తమానూ తన కొడుకుగురించి ప్రశ్నిస్తూ పూర్తిగా పిచ్చిదైపోయింది. నిద్ర, ఆహారం, విశ్రాంతి లేక, ఏడ్చి ఏడ్చి ఒకరోజు రాత్రి ప్రాణాలు వదిలింది రాధమ్మ. రాధమ్మ బావగార్లు ఆమెకు యథావిధిగా అంత్యక్రియలు జరిపించి, ఆమె ఆస్తి కైవసం చేసుకున్నారు. తమ మామూళ్ళు మామూలుగా ముట్టుతూండడంవల్ల వెంకమ్మ, పుల్లమ్మ, రాధమ్మ చనిపోయిందనే చీకు చింత ఏమీ పట్టించుకోలేదు.

ప్రకాశానికిమాత్రం రాధమ్మ చనిపోయిన దృశ్యం నరనరాలు తోడేసింది. తన ఆప్తులంతా తన్ను విడిచి పోతున్నారని ఆవేదనపడ్డాడు. జీవితం క్షణభంగురమనే భావం అతనిలో గాఢంగా నాటుకు పోయింది.

అవధాని మూడునెలలు వరుసగా ఆ అద్దె కొంపలో ఉన్నందువల్ల ఆ కుటుంబానికి కొంత మేలే జరిగింది. ఇరుగు పొరుగు అమ్మలక్కలు మాణిక్యందగ్గరకు రావడం మానేశారు. అవధాని భయంవల్ల సాంబ జాగ్రత్తగా మసులుకుంటున్నాడు. సెలవు పూర్తికాగానే, అవధాని తెంకుపూరు వెళ్ళిపోయాడు.

విరామం లేక, బాధ్యతలు చుట్టుముట్టిన సంసార పరిస్థితులలో చిక్కుకుని ప్రకాశం ఆ యేడు ఇంటరుపరీక్షలలో సాదాగా పాసయి ఊరుకున్నాడు. అతని పరీక్షా ఫలితం అవధానిని నిరుత్సాహపరిచింది. ప్రకాశానికి బి. ఏ. చెప్పిద్దామా వద్దా అనే ఆలోచనలో పడ్డాడు. వరసింహంమీద ఉన్న అభిమానంవల్ల, చివరికి బి. ఏ. చదివిస్తానని ఒప్పుకున్నాడు అవధాని.

## 17

పరంధామయ్యను మేజస్ట్రేటుగా కాకినాడ బదిలీచేశారు. అతను సరాసరి వచ్చి సోమయాజులు ఇంట్లో దిగాడు. అద్దెకు వేరే ఇల్లు చూసుకుని అప్పుడు సంసారం తెచ్చుకుందామనుకున్నాడు.

రాధమ్మ చనిపోయాక గతచరిత్ర క్రమంగా స్మృతిపథంలోంచి తప్పుకుని, ప్రకాశానికి, సోమయాజులుకు కొంచెం సమరసభావం ఏర్పడింది. ఇంటరు పరీక్షలో మంచి మార్కులు తెచ్చుకోలేదని సంతోషించి ప్రకాశమంటే పైకి ఆపేక్ష చూపించింది సీతమ్మ. అందువల్ల ప్రకాశం తరుచు వాళ్లయింటికి వెళ్ళి వస్తున్నాడు.

పరంధామయ్య, సోమయాజులును వెంట పెట్టుకుని మాణిక్యం యింటికి వచ్చాడు. సాధారణంగా నిరసనభావం చూపించే పరంధామయ్య ప్రత్యేకం పనిగట్టుకుని చూడ్డానికి వచ్చినరీతి చూసి ఆశ్చర్యపోయింది మాణిక్యం.

'అంతా కులాసా?' పరంధామయ్య ఇంట్లో కుర్చీలో కూచుని వాళ్ళ కుశలం అడిగాడు.

'ఆఁ. పిల్లలు క్షేమమా?'

'ఆఁ'

ప్రకాశం ఎదురుగా వచ్చి కూర్చున్నాడు.

'ఏం బాగా చదువుకుంటున్నావా?'

'ఆఁ'

'ఇంటరులో మార్కులు బాగా రాలేదుట'

'కష్టపడి చదివేవుంటాడు' సోమయాజులు అయాచితమైన సానుభూతి చూపించాడు.

ప్రకాశం మౌనంగా ఊరుకున్నాడు.

'ఇదేమిటే యింత చిన్న యింట్లో ఉంటున్నారు? ఈ పాతకొంపలో ఎల్లా ఉంటున్నారే? అద్దె యెంత?'

పరంధామయ్య తనొక్కడే వాళ్ళ శ్రేయోభిలాషి అన్నట్లు ప్రశ్నించాడు.

'ఉన్న డబ్బులో సర్దుకోవాలిగా!... 15 రూపాయలు అద్దె.'

'నాకు యిష్టంలేదమ్మా యిటువంటి యిళ్లల్లో అవస్థపడడం'

ఇంటి కప్పు, వాసాలు, పందికొక్కుల కన్నాలు అన్నీ జాగ్రత్తగా పరిశీలించాడు పరంధామయ్య.

'చూడవోయి బావా! ఆ యిల్లు నలభై రూపాయలకు కుదురుతుందేమో చూడు. పిల్లు కూడా నాతోటే ఆ యింట్లో వుంటారు.'

సోమయాజులు చిరునవ్వు నవ్వాడు ప్రకాశాన్ని చూసి.

పరంధామయ్య నోటినుంచి ఆప్యాయంలాంటి మాటలు ఎలా వస్తున్నాయా అని ప్రకాశం అనుమానించాడు. మాణిక్యం అన్నగారిలో క్రొత్త పరిణామం వచ్చిందనుకుంటూ, కారణం కూడా కొంత గ్రహించుకోగలిగింది.

'మంచిది. వస్తానే! ఒక వారంరోజుల్లో మీ వదిన పిల్లలు కూడా వస్తారు' అంటూ పరంధామయ్య వెళ్ళిపోయాడు.

సోమయాజులు నలభై రూపాయలకు యిల్లు స్థిరపరిచాడు. ఎనిమిది గదులు, ఒక వరండా, పెద్దదొడ్డి, కుళాయి,-లైట్లు,— ఇల్లు విశాలంగా అందంగా వుంది. పరంధామయ్య కుటుంబంతో ఆ యింట్లో దిగాడు. అన్నగారు పదిసార్లు ఆహ్వానించినందువల్ల కాదనలేక మాణిక్యం పిల్లలతో చేరింది ఆ యింటికి. ఆ యింట్లో మూడు గదులు మాణిక్యం కుటుంబానికి యిచ్చి తక్కిన భాగం పరంధామయ్య వాడుకుంటున్నాడు. చామంతిని థోర్డు ఫారంలోనూ, సోముని బి. ఏ. లోనూ చేర్పించాడు.

చిట్టిబాబు చనిపోయేక, చామంతిని ప్రకాశానికి యిచ్చి పెండ్లిచెయ్యాలిసిన పరిస్థితి వచ్చింది. కూతురు ప్రకాశాన్నే చేసుకుంటానని మోజు చూపించడం ఒకవిధంగా స్రవంతికికూడా హర్షమే కలిగింది. మార్కులు ఫైనలు చక్కటి మార్కులతో ప్యాసయిన ప్రకాశం చాలా తెలివైనవాడనే అభిప్రాయం ఆమెలో కలిగింది. బుద్ధిమంతుడైన మేనల్లుడికిస్తే పిల్ల సుఖపడుతుందని స్రవంతి వాదించింది.

తాను చదువు చెప్పించకపోయినా, అవధాని పట్టుదలతో ప్రకాశాన్ని బి. ఏ. లో కూడా చేర్పించాడని విన్నాక పరంధామయ్యబుద్ధికూడా మారింది. కూతురు ప్రకాశాన్నే పెండ్లి చేసుకుంటానంటూ పట్టుపట్టడం - తన సహాయం లేకుండా ప్రకాశం చదువు సాగించడం - మొదలైన విషయాలు ఆలోచించి, అంతకన్న మంచి వరుడు మామూలుకట్నానికి దొరకడం కష్టమని పరంధామయ్యకూడా ఒప్పుకున్నాడు. అందువల్ల పరంధామయ్యకు ప్రకాశంమీద ఆదరణ, అనుగ్రహం కలిగాయి. ప్రకాశం బి. ఏ. పూర్తిచేసేలోపుగా ఆర్థికంగా అవస్థ పడుతున్న అతని కుటుంబాన్ని తోచిన విధంగా ఆదుకోవాలనుకుని, కాకినాడ బదిలీ అవడం తన అదృష్టం అనుకుంటూ, పరంధామయ్య మేనల్లుడిని చేరదీశాడు.

చామంతి ఏపుగా అందంగా ఎదిగింది. పెండ్లీడు వచ్చిందని థోర్డుఫారంతో ఆమె చదువు ఆపేశాడు పరంధామయ్య. ఇంట్లోనే తల్లితోపాటు గృహకృత్యాలు చేస్తుంటూ, దొరికిన కథలపుస్తకాలు చదువుకుంటోంది. మాణిక్యం చామంతిని చూసేక ప్రకాశానికి యిచ్చి పెండ్లిచేస్తే ఎంత బాగుంటుందని లోపల మురిసింది. కాని ధనికుడై పెద్దహోదాలోఉన్న పరంధామయ్య ఆస్తిలేని తనకొడుక్కు పిల్లనిస్తాడని ఊహించుకోలేకపోయింది. అయినా అన్నగారు చూపించే ఆదరణకి ఇదే కారణం కాదుగదా అని తట్టకపోలేదు.

పరంధామయ్య పెంపొందించుకున్న పరపతి పలుకుబడివల్ల ఎరుగున్న వర్తకులు, ఉద్యోగులు, ఆఫీసు వ్యవహారాల్లో తారసిల్లే మనుష్యులు, అప్పుడప్పుడు బత్తాయిలు అరటిపండ్లు, మామిడిపండ్లు అలాటి బహుమతులు యినాం చేసేవారు. వద్దంటూనే సంతోషంతో పరంధామయ్య స్వీకరించేవాడు. వాటిని స్వీకరించినభాగంలో సగం తప్పకుండా మాణిక్యం కుటుంబానికి అందచేస్తూండేవాడు.

అవధాని పంపే డబ్బు యిరవై రూపాయలు చాలక ప్రకాశం, మాణిక్యం, పిల్లలూ సరిగా బట్టలులేక అవస్థపడుతున్నారు. మాసిపోయిన కావిరంగు ఆడ కట్టుపంచెతో మాణిక్యం కనిపించింది ఒకరోజు పరంధామయ్యకు.

'బట్టలేవిటే?' అని ప్రొద్దున్న పరంధామయ్య అనడం, సాయంత్రం ఒక తానుడైను ఇంట్లో పడెయ్యడంగూడా జరిగాయి.

ప్రకాశానికి బి. ఏ. లో స్కాలర్‌షిప్పు దొరకలేదు. ఒక నెల అవధాని డబ్బు కొంచెం ఆలస్యంగా పంపేడు. కాలేజీ జీతం కట్టాలనుకుంటూ తికమక పడుతూ ఏం చేద్దామా అని మాణిక్యం ప్రకాశం అనుకునే మాటలు విని పరంధామయ్య, 'డబ్బు అవసరమైతే నన్ను అడగకూడదటరా, నీకేం పరాయివాణ్ణా?' అంటూ జేబులోంచి తక్షణం అరవై రూపాయలు తీసి యిచ్చాడు. ప్రకాశానికి ఆశ్చర్యం, ఆనందం, మితిమీరిపోయాయి.

ఏ సహాయం చెయ్యకుండా, అభివృద్ధికి వచ్చిన పిల్లాడిని అల్లుడిగా చేసుకుందామని ప్రయత్నించినట్లు తన్ను లోకం నిందించకుండా, పరంధామయ్య, ప్రకాశం కుటుంబానికి కావలసిన సదుపాయాలు ఒక కంట చూస్తూనే వున్నాడు.

ఆనాడు సంక్రాంతి పండుగ. మాణిక్యాన్ని, సోమయాజుల్ని తన కుటుంబాలతో భోజనానికి ఆహ్వానించాడు పరంధామయ్య. భోజనాలయ్యాక అందరికీ క్రొత్త బట్టలు యిచ్చాడు.

'ఈ బట్టలన్నీ ఎందుకురా అనవసరంగా!' అంటూ సీతమ్మ తన క్రొత్తచీర అందుకుంది.

'మళ్ళీ ఇటువంటి పండుగనాడు అందరం కలిసి ఉంటాం కనుకనా?' అన్నాడు పరంధామయ్య.

మాణిక్యం కుటుంబానికి క్రొత్తబట్టలు ఎల్లాగా యివ్వదల్చుకున్నాడు కనుక, సోమయాజులు కుటుంబానికి కూడా ఆ ఖర్చులో ఖర్చు కొంచెం ఎక్కువ అయినా, బట్టలు పెట్టాలని నిశ్చయించాడు పరంధామయ్య. ఈ పనివల్ల బావకు మంచిగా కనిపించవచ్చు; ముందు ముందు తన ప్రయత్నాలకు అతడు బాగా సహాయపడవచ్చు అని ఆశించాడు పరంధామయ్య.

అనుకున్న పద్ధతిలో సోమయాజులు ప్రసంగం కదిపాడు.

'చామంతి పెళ్లి ఎప్పుడు స్థిరపరుస్తావోయ్! త్వరలో మాకు బూరెముక్కలు పెట్టించాలి.'

'వివాహం అంటే అన్నీ కలిసిరావాలి కదా!' పరంధామయ్య ప్రసన్నంగా మాణిక్యం వైపు చూశాడు.

మాణిక్యం జాగ్రత్తగా సంభాషణ వింటోంది. 'ఇంట్లో బి. ఏ. చదువుతున్న పిల్లవాడు ఉన్నాడుగదా! వాడికిచ్చి పెండ్లిచేసియ్యరాదోయ్!'

సోమయాజులు ఆనాటి సంభాషణ సారాంశం సూచించాడు.

మాణిక్యం ముఖం పువ్వులా వికసించి, అన్నవైపు ఆత్రుతతో చూసింది.

'ఏమంటావే మాణిక్యం!' సీతమ్మ ప్రశ్నించింది.

'మీరంతా ఒప్పుకుంటే నాకేమి అభ్యంతరం?'

పరంధామయ్య నవ్వేశాడు.

చామంతి క్రొత్త సిల్కు బట్టలతో మెరుస్తూ సిగ్గుతో గదిలోకి వెళ్ళిపోయింది. కాబోయే బావవైపు తలుకుతూ చూసేదు పోను.

మాణిక్యం సమాధానం చెప్పుతున్నట్లు ప్రకాశంవైపు చూసింది.

మామూలుగా క్రొత్తలాగా చొక్కా తొడుక్కుని కూర్చున్న ప్రకాశం ముఖంలో ఏవో తీవ్రఆలోచనలు మేఘాల్లా కమ్మినట్లు కనిపించాయి.

'కుర్రాడు ఒప్పుకుంటే నాకేమి అభ్యంతరం' మాణిక్యం తన యిష్టం సూచించింది. అందరూ ప్రకాశం ముఖంవైపు చూశారు.

'ఏరా! చామంతిని పెళ్ళిచేసుకోమని మీ మామయ్య అంటున్నాడు' సోమయాజులు ప్రతిపాదించాడు.

ప్రకాశం ఆలోచనతో తలదించుకున్నాడు.

గదిలో కిటికీలోంచి చూస్తున్న చామంతి ప్రకాశంనోట ఏంమాటలు వస్తాయా అని ఆత్రుతతో వేచివుంది. ఆమెగుండెల్లోంచి ఏవో రైళ్లు పరుగెడుతున్నట్లనిపించింది.

'అదేమిటిరా నాయనా! పిల్లనిచ్చి పెళ్లి చేస్తానంటూంటే అలా తలదించుకుంటావేమిటి? సిగ్గేమిటి? బాగుంది' సీతమ్మ అన్న మాటలకు అందరూ నవ్వేరు. ప్రకాశం కూడా నవ్వు ఆపుకోలేకపోయాడు.

'అదుగో! నవ్వుతున్నాడు! బంగారం లాంటి పిల్లను ఇస్తానంటే వద్దనే మగాడెవ్వడు?' సీతమ్మకు ఊతపదంగా సోమయాజులు అంటున్నాడు.

'ఓ తప్పకుండా చేసుకుంటాడోయ్!' ఒక తీర్పుచెప్పేసింది సీతమ్మ.

చెప్పడానికి సిగ్గుపడుతున్నాడని, ప్రకాశంమౌనం అంగీకారంగా భావించాడు పరంధామయ్య. తనకు రాత్రించి అవగనందున ప్రకాశం తనమనం కూర్చుకోలేదు. ఒంటరిగా ఉన్నప్పుడు కొడుకు అభిప్రాయం తెలుసుకుందామని మాణిక్యం కోరుకుంది.

సంతోషంతో పరంధామయ్య పిల్లల నందరినీ సినిమాకు పంపాడు. పిల్లలకు సాయంగా ఉంటానంటూ సీతమ్మ కూడా సినిమాకు వెళ్ళింది.

పెళ్ళిమాట తలపెట్టగానే ప్రకాశానికి బాధ ఎక్కువైంది. చదువు పూర్తిచేసుకుని, సంపాదనపరుడయితేనే కాని పెండ్లి చేసుకోడం భావ్యంకాదనే అభిప్రాయం అతనిలో ఏర్పడింది. కుటుంబం సంపాదనపై ఆధారపడుతున్నాడు. చెల్లెలు పెళ్లి, తమ్ముడి చదువు, తన ఉద్యోగం మొదలు సమస్యలు ఎదురుగా కన్పిస్తున్నాయి. ఆస్తి పాస్తులా లేవు. అటువంటప్పుడు పెండ్లి చేసుకుని సంసార బాధ్యతలు యిముడింప చేసుకోడం మంచిది కాదనే నిర్ధారణకు వచ్చేడు. దానికితోడు అతనిలో ప్రబలుతున్న వైరాగ్య దృక్పథం పరిణామానికి అతన్ని దూరం చేస్తున్నది. సంసారంలో పడి, బాధ్యతలతో సతమతమౌతూ, నిత్యం అవస్థపడేకంటె పెండ్లి చేసుకోకుండా ఒంటరిజీవితం గడపడం మంచిదని ప్రకాశం తరుచు తలపోస్తూఉంటాడు.

ఆ బాధ్యతలు తీర్చుకున్నాక, ఈప్రపంచ విషయాలనుంచి విరమించి ఆధ్యాత్మికచింతనలో కాలం గడపడం మంచిదనే అభిప్రాయం అతనిలో వేళ్లు నాటుకుంది.

'చామంతిని పెళ్ళిచేసుకుంటే బాగుంటుందిరా' మాణిక్యం పలకరించింది ఆ రోజు.

తల్లివైపు కోపంగా చూశాడు ప్రకాశం. 'ప్రపంచంలో పెళ్ళి తప్ప మరేం ముఖ్యంగా కనిపించటంలేదు మీకు' కసిరాడు ప్రకాశం.

'అదేమిటిరా! అంతకన్న మంచిపిల్ల నీకు దొరుకుతుందా?'

'అందుకే కాదనలేదు కాని, అప్పుడే పెళ్ళి. చదువులు పూర్తికాలేదు! ఉద్యోగం లేదు! ఆస్తి కొంచమైనా లేదు! పెళ్లాన్ని ఎలాగ పోషించడం!' తన సమస్యలు ఏకరువు పెట్టాడు ప్రకాశం.

'అలా అని పెళ్ళి మానుకుంటారుట్రా! ఇంత కాలం ఎలా గడిచేనో, ఇకముందు కూడా అలాగే గడుస్తుంది!'

'కబుర్లు చెప్పగానే సరికాదు! జరగాలి! అప్పుడు చూడాలి!'

'ఆ గొడవలన్నీ నీకెందుకు? మీ మామయ్యలు చూసుకుంటారుగా!'

'సిగ్గులేకపోతే సరి! ఎన్నాళ్లు వాళ్ళ మీద ఆధారపడ్డం?!'

'ఎన్నాళ్లు అవసరమైతే అన్నాళ్లూను!'

'గొప్ప తెలివైనదానివి!'

ప్రకాశం విసురుమాటలకు మాణిక్యానికి నవ్వు వచ్చింది.

# ★ ఉదయ కిరణాలు ★

'బాగుందిరా నీ వరస! పిల్ల నచ్చిందా అంటే యివన్నీ ఎందుకు కదపడం! పిల్లని చేసుకుంటానంటే ముహూర్తం నిశ్చయిస్తాం పెళ్లికి!'

'పెళ్ళి... పెళ్ళి... పెళ్ళి!!! ఇది తప్ప ప్రపంచంలో మనిషికి కావలసినది యింకేమీ లేదు!' అరుస్తూ తల్లిమాటకు సమాధానమీయక వీధిలోకి విసురుగా వెళ్ళిపోయాడు ప్రకాశం.

తండ్రి పోయినప్పటినుంచి అవధాని ప్రకాశాన్ని పోషిస్తున్నందువల్ల, అతనికి ముఖ్యంగా తన పిల్లను ప్రకాశానికి యిచ్చి పెండ్లి చెయ్యదల్చుకున్నానని తెలియ జెయ్యడం అవసరం అనుకున్నాడు పరంధామయ్య. తమ్ముడికి ఉత్తరం వ్రాయగా జవాబు వచ్చింది! 'ప్రకాశం మాణిక్యం ఒప్పుకుంటే తన కేమీ అభ్యంతరం లేదని.'

జవాబు తీసుకుని మాణిక్యాన్ని సమీపించాడు పరంధామయ్య.

'ఈ యేడు పిల్ల పెళ్లి చెయ్యాలనివుంది. ప్రకాశం ఏమన్నాడు!'

'మీరంతా చెబితే కాదంటాడా?' మాణిక్యం ఎటూ తేలకుండా తప్పించుకుంది. ప్రకాశం పెండ్లికి ఒప్పుకున్నాడనుకుని సంతృప్తిపడ్డాడు పరంధామయ్య.

సోమయాజులు ఒక ముహూర్తం సూచించాడు.

'నీ పెళ్లి నిశ్చయమయ్యిందిరా!' పరంధామయ్య ఒకరోజు రాత్రి ప్రకాశంతో అన్నాడు.

తన యిష్టాయిష్టాలు పరిగణించకుండా పెళ్ళిముహూర్తం నిశ్చయించబోతున్న పరంధామయ్య, సోమయాజులవైపు నిర్ఘాంతపోయి చూశాడు ప్రకాశం.

'నా కిప్పుడు పెండ్లి చేసుకోడం యిష్టం లేదు మామయ్యా!' ముఖం చిట్లిస్తూ తల దించుకున్నాడు.

'ఏం' సోమయాజులు కనుబొమలు ఎగిరాయి.

'చదువు పూర్తయి, ఉద్యోగంలో చేరితే కాని పెండ్లి చేసుకోను.

'వాటికి పెళ్ళి అడ్డమొచ్చింది?'

'అడ్డని కాదు. నాకిష్టం లేదు. అంతే!'

'నీకోసమని అప్పటిదాకా ఎదిగిన పిల్లను పెళ్ళి చెయ్యకుండా వుంచమన్నావా?' సోమయాజులు రుద్రుడైపోయాడు కోపంతో.

ప్రకాశంలో మౌనం.

'చేప్పేది ఏదో సరిగా చెప్పు! .... పిల్ల నచ్చలేదా?'

ప్రకాశం మాట్లాడలేదు.

'అదైతే, విప్పి చెప్పకూడదూ?'

'పిల్ల బాగులేదని నేనెప్పుడూ అనను?'

'మరి?'

'ఇప్పుడు నాకు పెళ్లి యిష్టంలేదు'

'ఎప్పుడు చేసుకుంటావు'

'అది నే చెప్పలేను'

'అల్లా తికమకగా మాట్లాడకపోతే పిల్ల నచ్చలేదని చెప్పకూడదూ!

'నాకు పెళ్లి చేసుకునే ఉద్దేశ్యం లేనప్పుడు పిల్లగురించి అభిప్రాయమివ్వడమనే ప్రసక్తికి చోటులేదు'

'ఆ! ఎంత పెంకితనంగా సమాధానం చెబుతున్నావు?'

'ఇంతకన్న దక్కుటి సంబంధం వస్తుందీ నీకు?' పళ్లు కొరికాడు; సోమయాజులు ఉగ్రుడై.

బహుశా చామంతి నచ్చక ప్రస్తుతం పెళ్లి చేసుకోనని ప్రకాశం ఎత్తువేశాడనుకున్నాడు పరంధామయ్య. కాలేజీలో చదువుతున్నవాడికి తోటి విద్యార్థినులు ఎంతోమంది అందంగా కనిపిస్తారు. ఆ దృష్టికి సంసారపక్షంలో ఉన్న చామంతి సరిగా కనిపించకపోవడం అసహజం కాదు. అయినా కొంచెం ఓరిమి వహించడం మంచిదనుకున్నాడు పరంధామయ్య.

'పోనీ యింకో నెల్లాళ్ళు ఆగుదాం! ఈలోపుగా వాణ్ణి ఆలోచించుకోనీ!' పెళ్లి ముహూర్తం గడువు పొడిగించాడు పరంధామయ్య.

ప్రకాశం ఏమనకుండా వెళ్ళిపోయాడు తనగదిలోకి.

మాణిక్యం ఒక నిట్టూర్పు విడిచింది.

'ఏమే! నువ్వైనా నచ్చ చెప్పలేకపోయావా?'

'నే చెప్పవలసింది చెప్పాను. ఎదిగే కుర్రాళ్లు మనమాట వింటారా?'

సోమయాజులు ఇచ్చిన సమాధానంలో మాణిక్యం కూడా చామంతిని ఇష్టపడటం లేదా అనే భావం స్ఫురించింది. పరంధామయ్య తక్షణం అడిగాడు.

'చామంతిగురించి నీ అభిప్రాయం!

'దానికేం! లక్ష్మిలాంటి పిల్ల!'

'మరి! ఎందుకు చేసుకోడూ!'

'డబ్బులేనప్పుడు పెళ్లి ఎందుకంటాడు!'

'డబ్బు జీవితాన్ని ఉద్ధరిస్తుందా?'

'పెళ్ళికూడా జీవితాన్ని ఉద్ధరించదని కాబోలు వాడి ఉద్దేశ్యం' సోమయాజులు వెటకారం చేశాడు.

పరంధామయ్య ఒక క్షణం ఆలోచనలో మౌనంగా ఉన్నాడు.

'కట్నంమీద ఏమన్నా ఆశేమో!' సోమయాజులు చెప్పాడు.

మాణిక్యానికి అరికాలు మంటెక్కింది.

'వాడికి కట్నమంటే అసలు యిష్టం లేదు.'

'ఆఁ, డబ్బు కావాలన్నాడుగా! అందుకని....వాడి ఉద్దేశ్యం అలా వుందనుకున్నాను!' వ్యంగ్యంగా సమర్థించుకున్నాడు సోమయాజులు.

'సరే! నువ్వుకూడా ఆలోచించు. ఒక నెల రోజుల్లో ఏదో తేల్చి చెప్పండి! ఇది కాకపోతే మరో సంబంధం!' పరంధామయ్య కోపంతో కదిలిపోయాడు. సోమయాజులు అతన్ని అనుసరించాడు. ప్రసంతి ఈ సంభాషణ అంతా వింటూ ప్రకాశం సమాధానం అతని ప్రవర్తనతో సమన్వయించుకోలేకపోయింది. చామంతితో సరదాగా మాట్లాడే ప్రకాశం ఆమెను పెండ్లిచేసుకోనని ఎలా అన్నాడా అనే ఆమెకు వింతగా ఉంది.

చామంతికి దిగులుపట్టుకుంది. ప్రకాశం చేసుకోకపోతే ఎవరో ఒకరికి యిచ్చి ముడి పెడతారు! ఆ కాబోయే భర్త ఎవరో... ఎన్నో ఊహాలు ఆమె మెదడులో దొర్లాయి. అసంతృప్తిలో అల్లాడింది.

సోమయాజులు ఒక సలహా యిచ్చాడు. ఆ సలహాప్రకారం పరంధామయ్య అవధానికి మరో ఉత్తరం వ్రాశాడు. ప్రకాశాన్ని ప్రస్తుతం పెళ్లిచేసుకోమని నచ్చచెప్పవలసిందని ఆ ఉత్తరం సారాంశం. ముఖ్యంగా పెళ్ళివిషయం జీవితంలో చాలా ప్రధానమైనది కనుక, జ్ఞానమొచ్చిన పిల్లలే తమ కర్తవ్యాలు నిర్ణయించుకోవాలని అవధాని

ఉద్దేశ్యం. తన అశక్తత తెలియజేశాడు అవధాని.

పరంధామయ్యకు కోపం విజృంభించింది. బహుశా అవధానికికూడా చామంతిని ప్రకాశం చేసుకోడం యిష్టంలేదనుకున్నాడు. చిన్నప్పటినుంచి భావాల్లో నడతల్లో అన్నదమ్ము లిద్దరికీ చుక్కెదురు. కాని అవధానిమాత్రం అన్నగారియందు అభిమానం, గౌరవంమాత్రం చూపించేవాడు. అది గమనించక పరంధామయ్య తమ్ముణ్ణి అపార్థం చేసుకున్నాడు.

ప్రకాశం తన పట్టుదల వదలలేదు. దీనివల్ల వచ్చే అనర్థాలుకూడా ఎదుర్కుంటానంటూ దృఢనిశ్చయం చేసుకున్నాడు.

సోమయాజులు అవధానికి ఒక ఉత్తరం వ్రాశాడు. మేనరికం చేసుకోకపోడానికి ప్రకాశం పెంకితనమే కారణమని, అతను యిచ్చే ఆర్థికసహాయం ఆపేస్తానని బెదిరిస్తే తప్పక చామంతిని పెండ్లి చేసుకోవచ్చుని. ఆ ప్రకారం ఒకసారి ప్రకాశాన్ని బెదిరించవలసిందని కోరాడు. అనాథులైన కుర్రాళ్లపై చూపే కృత్రిమ బుద్ధికి అవధాని క్రుద్ధుడైయాడు. అటువంటి తెలివితక్కువ ఉత్తరాలు ఇకముందు వ్రాయవద్దని ఘాటుగా సమాధానం యిచ్చాడు.

'మామయ్యమద్దతు చూసుకొని తెగ నీల్గుతున్నాడు' సోమయాజులు అరిచాడు.

'పరంధామయ్యకైనా బుద్ధి ఉండొద్దూ! పిల్లనివ్వనని, తిరిగి మనస్సు ఎల్లా మార్చుకున్నాడో అర్థంకాదు. వెంకటప్పయ్య అన్నాడుకూడా ప్రకాశానికి త్వరలో మారకంఉందని' సీతమ్మ గతచరిత్ర కదిలించింది.

పరంధామయ్య చెవిలో సోమయాజులు ఊదాడు ఈవిషయం.

'నిజమేనా' నోరు ఆవలించాడు పరంధామయ్య.

'నిజం' గంగిరెద్దులా తల ఊపాడు సోమయాజులు.

పరంధామయ్యకు నమ్మకం కల్గలేదు.

స్రవంతికూడా అబద్ధమంటూ అరిచింది. తన కూతురిని పెండ్లిచేసుకోనంతమాత్రాన ప్రకాశంపై విరోధం వహించడం, కుత్సితంగా ప్రవర్తించడం, స్రవంతికి యిష్టం లేదు. పూబంతినైనా సాంబుకు యిచ్చి పెండ్లి చెయ్యొచ్చు అనే ఆశలో ఉన్న స్రవంతి వెంకటప్పయ్య జ్యోతిషాన్ని తోసి పారేసింది.

మేజిస్ట్రేటుహోదా ... కావలసినంత డబ్బు-అందమైన చామంతి-ఆదుకునే బంధుత్వం...అన్నీ దిగదుడిచి, పెండ్లికి ఒప్పుకోని ప్రకాశం సిగ్గుపడేలాంటి మంచి సంబంధంతెచ్చి చామంతికి పెండ్లిచేస్తానని ప్రతిజ్ఞచేశాడు పరంధామయ్య.

కోపంతో శాసించాడు - మాణిక్యం యింటిచాయలకు ఎవ్వరూ వెళ్లకూడదని.

మాణిక్యాన్ని పిలిచి చెప్పాడు. 'ఆ మూడు గదల అద్దె పదిహేను రూపాయలు, విడిగా చెల్లించుకోవలసిందని'

మాణిక్యం ఏమీ అనలేకపోయింది. ఎప్పుడైతే ప్రకాశం పెండ్లి చేసుకోనన్నాడో, అప్పుడే యిటువంటి పరిస్థితులు రాగలవని ఊహించుకుంది మాణిక్యం.

తన భావాలు అర్థంచేసుకోలేని పెద్దలకు ప్రత్యేకం నచ్చచెప్పడం అనవసరమని ప్రకాశం ఊరుకున్నాడు. ఎప్పటికైనా తన్ను అర్థంచేసుకునే కాలం రాగలదని నమ్మాడు.

సోమయాజులు, పరంధామయ్య ఒళ్లు వంచి, ఊళ్ళు గాలించి చామంతికి ఒక సంబంధం నిశ్చయించారు రెండు నెలల్లో.

వారం రోజుల్లో పెళ్లి ముహూర్తం నిశ్చయించారు. పెండ్లి సులువుగా, సునాయాసంగా, జరిగిపోయింది.

పెండ్లికి అందరితోపాటు మాణిక్యానికి కూడా ఆహ్వానం వచ్చింది. వచ్చిన మాణిక్యాన్ని స్రవంతి తప్ప మరెవ్వరూ పలకరించలేదు. వివాహలగ్నానికి వెళ్ళి కాసేపు కూర్చుని తిరిగి వచ్చేశాడు ప్రకాశం. మునుపు సరదాగా కలిసిమాట్లాడే బోసు మౌనంగా దూరంగా ఉండిపోయేడు ప్రకాశానికి.

రాజమండ్రిలో రఘురామయ్యగారి కుమారుడు సీతాపతి యం. బి. బి. ఎస్. చదువుతున్నాడు. ఈ వద సంవత్సరంతో పూర్తయింది. అందంలో, ఆకారంలో, ప్రకాశంకన్న చాలా బాగుంటాడు. రఘురామయ్యగారు రెవిన్యూ ఇన్స్పెక్టరుగా పనిచేస్తున్నాడు. వయసులో పరంధామయ్యకన్న పెద్ద. తండ్రి తాతలు యిచ్చిన అయిదెకరాల మాగాణీ భూమిని పెంచి పదెకరాలు చేశాడు. పల్లెగ్రామంలో ఒక యిల్లు కట్టేడు.

'అదృష్టవంతురాలైన చామంతిని అలా భూడిదికి యిస్తానంటే, దైవం ఒప్పుకోవద్దూ'

'రాజు తల్చుకుంటే దెబ్బలకు కొదవా అన్నట్లు మేజిస్ట్రేటు తల్చుకుంటే సంబంధాలకు కొఱతా?'

'కుక్కను తెచ్చి సింహాసనంమీద కూర్చోపెడతానన్నా, ఉన్న చెడుబుద్ధి పోగొట్టుకోలేదుట'

పెళ్ళికి వచ్చిన బంధుజనం ఎవరికి తోచినవిధంగా వాళ్ళు అనుకున్నారు.

[ఇంకా వుంది]



మాచ్‌ఖండ్ జలపాతమునకు ముందు ప్రక్కన నిర్మాణములో వున్న డైవర్షన్ డామ్.



మాచ్‌ఖండ్ జలపాతం వద్దనుంచి కనిపించే మాచ్‌ఖండ్ 'నది'



మాచ్‌ఖండ్ జలపాతం వద్ద "టర్బైన్ ట్యూబ్" వేయుటకుగాను ఈ కొండమీద నుంచి క్రిందపవర్ హౌస్ వరకు తయారు చేయబడిన మార్గం.

ఫొటోలు: యస్. రామచంద్రరావు, విజయవాడ.



మాచ్‌ఖండ్ జలపాతం వద్ద బద్దిగూడ గ్రామం సంతలో ఒక దృశ్యం (సంతకు అమ్ముటకు వచ్చిన 'సవర' జాతి స్త్రీలు.)

# శిథిలశిశిరంలో చిగురు

## పావనరాం

"ఆదరాభిమానాలు ఆదానప్రదానాలు" "ఐతే ప్రేమా, దయా, కరుణా, జాలీ - చవకబారు వ్యాపార పక్కీలో - 'ఇంతకి-ఇంతా'-అని జరగాలంటారు?"

కాస్సేపాగి...

"కళ్లుమూసుకొని ఆలోచిస్తే అంతే"-అన్నాను. రామారావ్ 'కన్విన్స్' అయినట్లేమీ కనబడలేదు.

రామారావూ, నేనూ ఊళ్లో 'లాడ్జి'లో పక్క పక్క గదుల్లో ఉంటున్నాం. డి.ఇ.ఒ. ఆఫీసులో క్లర్కుగా ఉంటున్నాను నేను. అతను యూనివర్శిటీలో 'ఆనర్సు' చదువుతున్నాడు. స్వతహాగా కలుపుగోలు మనిషి కాడు. మొదట్లో అతను అంటీ అంటనట్టుగా ఉంటూవచ్చినా ... కాలక్రమేణా, సామీప్యతవల్ల మా సాన్నిహిత్యం వృద్ధిపొందింది.

* * *

"రేపట్నుంచీ సెలవులండోయ్" అంటూ కుర్చీ లాక్కుని కూర్చున్నాడు.

"ఐతే మరి ప్రయాణ మెప్పుడు?"

"ఎవరూ?" అన్నాడు - వింతగా.

"మీరే...."

"వెళ్లటం లేదు." ముఖం పక్కగా పెట్టి అన్నాడు.

నా కాశ్చర్యం వేసింది.

"అదేమిటండీ... ఫైనల్ ఇయరా, ఏమీ నానా?.....మీ ఊళ్లో ఓ పదిరోజుల పాటు, మీవాళ్లతో గడపడం ఎంత హాయిగా ఉంటుందో ఆలోచించారా?.."

"నాకు మీ రనుకునేటటువంటి..'మావాళ్లెవరూ లేరండీ!"

అని ఓ నిముషం ఆగి, ఎటో చూస్తూ అన్నాడు.

"ఈ ప్రపంచంలో నే నేకాకిని. ప్రేమాభిమానాలకి నేను నోచుకోలేదు. ఏదో, ఇల్లాగే నా జీవితం వెళ్ళిపోతే నాకు తృప్తిగా ఉంటుంది."

ఇన్నాళ్లుగా నే నతనిలో గమనిస్తున్న - నిర్లిప్తతా, వైముఖ్యాలకి - కారణం నాకు కొద్దిగా అవగతమయింది.

"ఎప్పుడన్నా, 'నా కెవ్వరూ హృదయం ఇవ్వలే' దంటారే కాని, మీ రెప్పుడైనా మీ హృదయం ఎవరికైనా తెరిచారేమో ఆలోచించారా?" అత నేమీ అనకపోవడం చూసి...

"ఏదో అర్థంలేని బాధతో అనవసరంగా మీరు మనస్సు పాడుచేసుకుంటున్నారు... జీవితాన్ని సుఖమయం చేసుకోవడం, చేసుకోకపోవడం మన చేతుల్లోనే ఉంటుంది..." అన్నాను.

"అంత ప్రయత్నించీ, బాధపడీ—ఆ-జీవితాన్ని - సుఖమయం చేసుకోకపోతే ఏమో?" అంటూ లేచి వెళ్లిపోయాడు.

నే నన్నదానికి సరియైన సమాధానం ఇవ్వలేనప్పు డెప్పుడూ అతనిల్లాగే - చటుక్కున - లేచి వెళ్ళిపోతూ ఉంటాడు. కాని నే నన్నదాన్ని గురించి ఎక్కువగా ఆలోచిస్తూ ఉంటాడు. రెండు మూడు రోజులు, ఆ విషయాన్నే కదుపుతూ ఉంటాడు. అట్లాంటప్పుడు నేను మరింకేమీ అనకుండా ముభావంగా ఉంటూ ఉంటాను. నా ఉద్దేశాల్ని అతనిమీద బలవంతంగా రుద్దడం నా అభిమతం కాదు. ఆలోచించి, తర్కించి - అతనే తన చిక్కు విడదీసుకోవాలని నా కోరిక.

అతని గదిలోకి వెళ్లి మంచంమీద కూర్చున్నాను. చదువుతున్న ఉత్తరం బల్లమీద పెడుతూ అన్నాడు.

"మా మావయ్య సాయంత్రం బండీలో 'పలాసా' వెళ్తున్నారట.....రమ్మనమని ఫర్మానా."

టైంపీస్ 'మూడు' చూపెడుతోంది.

"మరి బయలుదేరండి. టైమవుతున్నట్టుంది."

"వెళ్లాల్సిన అవసరం నాకేమీ లేదు"

"మీరు స్టేషన్‌లో కనబడకపోతే ఆయన మనస్సెంత చివుక్కుమంటుందో కొంచెం ఆలోచించండి?"

"నా మనస్సూ ఇరవై ఏళ్లనుంచి చివుక్కుమంటునే ఉంది. ఇది ఎవరికేనా పట్టిందా?"

ఇది అతని మామూలు ధోరణే.

"మీ తండ్రిగారు పోయాక మీ ఆస్తి సంతట్నీ 'పరాయత్తం' కాకుండా చూసింది—ఈ మావఁగారే అని మరిచి పోకండి."

"ఇది ఆయన, తన చెల్లెలుగారికి (!) చేసుకున్నారు..."

"మీ అమ్మగారికి చేస్తే మీకు చేసినట్టు కదూ?" అతనేమీ అనకుండా అల్లాగే కూర్చున్నాడు.

"మనకి అవతలివాళ్లంటే ఇంత నిర్లక్ష్యం! ఏమనా అంటే నామీదెవరికీ అభిమానం లేదంటారు...మీమీద అభిమానమే లేకుంటే...ఆయన మిమ్మల్ని స్టేషన్‌కి రమ్మనమని రాస్తారంటారా?"

వాళ్ల 'మావఁయ్య' పక్షం మాట్లాడుతున్నానని అతనికి కోపంవచ్చింది. సమాధానం-ఏమీ రాకపోవడంబట్టి-అతని అంతః ఘర్షణ నాకవగతమయింది. రామారావ్ స్టేషనుకి వెళ్లలేదు.

* * *

మా బాబయ్యగారి తోడల్లుడు కె. జి. లో జాయినయ్యారు. చిన్న ఆపరేషన్. ఆయనకి భోజనం, ఫలహారం రెండుపూటలా నేనే అందించాల్సి వచ్చింది.

రామారావడిగాడు. 'ఏం హడావడిగా ఉన్నారు?'

కారణం చెప్పాను.

"ఎవరూ! మీ బాబయ్యగారి భార్యగారి చెల్లెలి భర్తా?" అంటూ నా వేపు 'జూ'లో జంతువు వేపు చూసినట్టు చూశాడు.

మరున్నాడు మా ఆఫీసర్ ఇన్స్పెక్షన్‌కి వస్తున్నాడు. రాత్రిచాలావరకు 'ఫైల్సు'తో కూర్చోవాలి.

ఆరోజే మా 'బంధువు' ఆపరేషనయింది. రాత్రి ఆయనకు సాయం పడుకోవాలి. 'ఎల్లాగా' అని ఆలోచిస్తూ 'లాడ్జి'కి చేరాను.

ఇదేమాట రామారావ్‌తో అన్నాను.

'దానేముందండీ నేనాయనకి సాయం ఉంటాను. ఆఫీసుపని చూసుకోండి' - అన్నాడు.

అతని ధర్మమా అని మా ఆఫీసరుముందు నేను పరువు నిలబెట్టుకోగలిగాను.

రెండురోజుల్లో మా 'బంధువు' కూడా 'రిలీవ్' అయ్యారు. వెళ్తూ, వెళ్తూ మా ఇద్దర్నీ - ముఖ్యంగా రామారావ్‌ని చాలా చాలా అభినందించారు. సెలవలకి మమ్మల్నిద్దర్నీ వాళ్లఊరు రమ్మన్నారు.

రామారావ్ పొంగిపోయాడు. పాపం!

అతన్నెవరూ ఎప్పుడూ - ఇంతల్లా - మెచ్చుకోలేదట. ఇందులో సగంఅభిమానం, వాళ్లవాళ్లమీద చూపించుకుంటే ఇంతకి రెట్టింపు సానుభూతి అతను పొందగలిగేవాడనిపించింది. ప్రకటితమైతే నేకాని మన ప్రేమాభిమానాల్ని లోకం గుర్తించదని అతనికింకా తెలియలేదు. కనుకనే తనెవరి విషయం పట్టించుకోకపోయినా, తనంటే దేవుళ్లాడాలని ఆశిస్తూ ఉంటాడు.

# ★ శిథిలశిశిరంలో చిగురు ★

ప్రతి ఉత్తరంలోనూ మా బంధువు... రామారావు మాట రాసేవారు.

'ఎంత ఇదైనవారండీ' అన్నాను - మా బంధువును ఉద్దేశిస్తూ.

దీనికి సమాధానంగా కాకుండా ... అతన్ని ఉద్దేశిస్తూ అన్నాను 'కేవలం - హృదయం ఉన్నంతమాత్రాన లోకం దాన్ని గుర్తించదండీ! దాని కొలువు - అభిమానాన్ని - నాలుగురోళ్ల మధ్య పెట్టి వేలం వేస్తే కాని - మనల్ని - ఎంత దగ్గరవారే నాసరే గుర్తించరు. బంధుమిత్రులు మన కక్కరలేకపోతే - వేరే సంగతి కాని ప్రపంచంలో - అందరిలాగా సంసారపక్షంగా బ్రతకాలంటే......ఇదే మార్గం." కాస్సేపాగి

అందుకనే నేనంటూ ఉంటాను 'అవరాభిమానాలు అప్రధానాలు'ని" — అన్నాను.

పది, పదిహేను నిమిషాలలాగే కూర్చున్నాను. తర్వాత ముఖం కాస్త తేటపడింది. పైకనకపోయినా — 'ఔను సుమండీ' అనుకుంటున్నట్టు అతని ముఖమే చెప్తోంది.

* * *

వారం రోజులు పోయాక 'తమ్ముడి ఉపనయనానికి రమ్మని' అతనికి జాబొచ్చింది.

నే నడక్కుండా అతనే చెప్పాడు 'వెళ్ళన'ని.

నే నతనికి చెప్పొచ్చిననాటికి-అతను-కన్విన్స్-అయ్యాడని నాకు తెలుసు. కాని దాన్ని ఒప్పుకోని, ఆచరణలో పెట్టడానికి-ఆత్మాభిమానంగల రామారావ్‌కి ఇంకా కొంత 'టైము' తీసుకుంటుందని - నేను తెలుసుకోగలిగాను.

తనంతట తానే అన్నాడు.

'నే వెళ్లకపోతే ఒడుగాగిపోతుందా?'

'ఔనాను! ఆగిపోదు. నిక్షేపంగా జరిగిపోతుంది...ఇంకో నాలుగేళ్లు పోయాక, మీ తమ్ముడూ మీలాగే 'నాకు గాగులు లేవు, నా కుషస్సులు లేవు' అంటూ జీవితరంగంలో అడుగు పెడ్తాడు. అందుకు మీరు కూడా బాధ్యత వహించవలసి వస్తుంది." అన్నాను. అతని ముఖం ఆషాఢ మేఘంలా వివర్ణమయింది.

ఈ మాటలు ఎక్కడ తగిలాయో, అక్కడ తగిలాయ్!

* * *

ఒడుక్కి వెళ్ళకూడదని నిర్ణయానికయితే వచ్చాడు కాని, అది సరియైనదని...ఎంత

ప్రయత్నించినా అతను తృప్తిపడలేక పోతున్నాడు. ఇందువల్ల అతను చాలా బాధపడుతున్నట్లు కూడా నేను గ్రహించగలిగాను.

* * *

సాయంత్రం ఇద్దరం ఊళ్ళోకి వెళ్ళాం. మరునాడు నేను మా బాబయ్యగారి ఊరు వెళ్తున్నాను.

'షాపు'లో 'కేక్' కొన్నాను. 'ఇది దేనికి?' అన్నాడు.

'మా బాబయ్యగారి అమ్మాయికి' అన్నాను.

చిన్న పిల్లలకి ఆటసామాన్లూ, బొమ్మల పుస్తకాలూ కొన్నాను. కళ్ళప్పగించి చూస్తున్నాడు. అడక్కుండానే ఎవరెవరికేవేవో చెప్పాను. లాడ్జికొచ్చాం.

మరునాడు నేను మా బాబయ్యగారి ఊరు వెళ్ళిపోయాను.

* * *

నేను తిరిగివచ్చిన వారం రోజుల్లో, రామారావుకి సెలవలిచ్చారు. అది అతని ఫైనల్ ఇయర్.

'ఊరెళ్తున్నానండీ' అన్నాడు - 'రాగద్వేషాల్ని' జయించిన వాడిలా ముఖం పెట్టి. నేనాశ్చర్యపడ్డా, అదివ్యక్తం చేయకుండా.. 'తప్పకుండా' అని 'సెన్డాఫ్' ఇచ్చాను.

* * *

అతను రిసర్చిలో చేరాడు. ఇద్దరం చాలా 'క్లోజ్'గా 'మూవ్' అవుతున్నాం. అతను నాతో చాల 'ఫ్రీ'గా మాట్లాడుతున్నాడు. ఇప్పుడు మా సంభాషణల్లో తరుచు స్త్రీ ప్రసక్తి వస్తోంది. ఇదివరకెప్పుడూ అతను 'ఆడ' విషయం మాట్లాడేవాడు కాడు. దార్లో పడుతున్నాడనుకొన్నాను.

ఏదో మాటల్లో, అతనే వాళ్ళ మామఁగారి కూతురు విషయం చెప్తూ ఎస్. ఎస్. ఎల్. సి. పరీక్షకి వెళ్ళిందన్నాడు.

'మరింకేఁ?'

సడన్‌గా 'సీరియస్' అయిపోయాడు.

'ఇంతవరకూ ఈ ప్రపంచంలో నన్నెవరూ అర్థం చేసుకోలేదు. ఇప్పుడెవరో కొత్తమనిషి వచ్చి ఈ లోటు భర్తీ చేస్తుందని నమ్మకమేమిటి? ... ఈ భారం ఆ 'క్రొత్త మనిషి' మీద మోపడం నాకిష్టం లేదు.'

అతని హృదయం పూర్తిగా మైదానంగా మారలేదని ఇంకా కొంత మేర 'బంజరు'గా ఉందని గ్రహించాను.

"మీరు మోపుతాననుకొంటున్న భారం అవతలివాళ్ళు 'భారం'గా తీసుకోరేమో?.. అవతలివాళ్ళను మీరు మనస్ఫూర్తిగా 'కాన్ఫిడెన్స్'లోకి తీసుకొంటే, వాళ్ళూ మిమ్మల్ని 'నెత్తిమీద' పెట్టుకొంటారు" ..అని మీ జీవితంలో భాగం పంచుకోబోయే. 'ఆవిడ' మీ జీవితాన్ని 'తపస్' ాలని ప్రాణాలు వాడని వసంతరాముంలా' పంచుకొ చేయబోతూ అన్నాను చిరునవ్వుతో...

అతను పెదిమల్ని బిగించే 'దీక్ష' నవ్వు నవ్వాడు.

* * *

తర్వాత రెండు, మూడు సార్లు వాళ్ళ మేనమామ వచ్చి, వెళ్ళారు.

* * *

ఓనాడు 'లైట్‌హౌస్' దగ్గర కూర్చున్నాం.

'ఒ'కమని నావేపు తిరిగి అన్నాడు.

'మీరెందుకు పెళ్ళిచేసుకోరూ?'

నా 'ప్రాబ్లెమ్' సాల్వయింది. మీ మాటేమిటి? అన్నట్టనిపించింది నాకు.

అవతలివాళ్ళ విషయాల్లో కూడా కుతూహలం కనబరుస్తూ ఉండాలని అతనికిప్పుడిప్పుడే తెలుస్తోంది.

'నాలో ఏముందండీ? ఉన్నత విద్య అ—లేదుకదా! డబ్బుంటారా, నా జీతం నూట ఇరవై! ఇది నా ఖర్చులకే చాలదు' అన్నాను.

'ఈ లెక్కని హిందూదేశంలో 'ఏలకుండి'కో ఉంటుదన్నమాట— పెళ్ళికి అర్హత!...' అని ఓ చెణుకు విసిరాడు.

'ఆత్మన్యూనతవల్ల మనుష్యులు తాము బాధపడడమే కాక ఇతరులనుకూడా బాధిస్తూ ఉంటారు'......

'అలా చేయడం ఇష్టంలేక నేను పెళ్ళి చేసుకోకపోవడం'...అన్నాను.

అతనికి కొద్దిగా కోపం వచ్చింది.

నెమ్మదిగా అన్నాను 'నేను ఖర్చుదారునండీ. సినిమాకి 1-4-0కి కాని వెళ్ళను. రోజూ నాలుగుసార్లు కాఫీ, రెండుసార్లు టిఫిన్! నా హోదాకితగిన 'దర్జా' మెయిన్‌టైన్ చేస్తాను. నా జీతంతో ఇంకో మనిషిని భరించాలంటే, ఈ నా సుఖాల్లో కొన్నిటిని త్యాగం చెయ్యాలి. అది నేను చేయలేను'

"మన శారీరక సుఖాల్లో కొన్నిటిని ఇంకోళ్ళకోసం, అందులో-మన జీవితాన్ని పంచుకొనే స్త్రీ-కోసం త్యాగంచేయడం వల్ల—ఆవిడ పొందే తృప్తిలో......మనం ఎంత ఆనందం పొందగలమో ఆలోచించారా?" అన్నాడు.

కథ 'ఎదురు తిరిగిందే' అనుకొని...ముఖమంతా ఆశ్చర్యంతో అతన్ని చూశాను. అతని మాటల్లో ఓ ముఫ్ఫైఏళ్ళ రామారావ్ కనబడ్డాడు నాకు.

* * *

ఆ శ్రావణంలో రామారావ్‌కి, అతని మామయ్యగారి కుమార్తెతో వివాహమయింది.

ఇప్పుడతను గుంటూరులో లెక్చరర్.

* * *

నాకు 'మా రాజమండ్రీ'కి ట్రాన్స్ఫర్ అయింది.

అదే ఆదివారం.

మబ్బు మబ్బుగా ఉంది. తడిగాలి వీస్తోంది.

'హిగిన్ బాథమ్స్'లో ఏదేనా పుస్తకం కొందామని 'స్టేషన్'కి బయలుదేరాను.

రైలేదో ప్లాటుఫారంమీద ఆగి ఉంది. జనం కిటకిట లాడుతున్నారు.

ఇంజను వేపు నడుస్తున్న నాకు, కుళాయి దగ్గర మరచెంబుతో 'నీళ్ళు పడుతున్న' రామారావ్ కనుపించాడు. రెండేళ్ళ కుర్రాణ్ణి ఎత్తుకొన్నాడు. మరచెంబుని ఎదుటి 'కంపార్ట్‌మెంట్'లో [illegible] అందించాడు. 'ఆవిడ' రామారావ్ 'శ్రీమతి' అన్నమాట.

దగ్గరగా వెళ్ళి నుంచున్నాను. నన్నతను చూళ్ళేదు. చిన్నవాణ్ణి ప్రేమతో కసురుతున్నాడు. ఆవిడ నావేపు 'ఈ మర కెవరోయ్' అన్నట్టు చూస్తోంది.

ఇంకా ఊరుకుంటే రైలు కాస్తా వెళ్ళిపోతుందని, అతని భుజంమీద చెయ్యివేశాను.

'ఎంతసేపయింది వచ్చి' అంటూ ప్రీదా ప్రమోదకుమా దాక్షిణ్యాల్లో నా చేతిని తన చేతుల్లోకి తీసుకొన్నాడు. భార్యతో ఈయనే 'విశాఖపట్నం మిత్రుడు' అన్నాడు.

ఆవిడ 'విశాఖపట్నం మిత్రుడు' - అనగానే 'ఓహో' 'ఆయనా!' అన్నట్టు చూసింది. నాగురించి అంతా విన్నేసినట్టు...

## ★ శిథిలశిశిరంలో చిగురు ★

అవిడ ముఖం చెప్తోంది. ఈమాట ఆమాట మాట్లాడుకున్నాం.

నన్ను క్షేమంగా భార్యతో 'ఈయన కింకా నచ్చిన పిల్ల దొరకలేదు' అని నేనేమీ నొచ్చుకోకుండా - పువ్వులు పువ్వులుగా నవ్వేశాడు. అవిడ గాజాల ఘలఘల ధ్వనుల్లో కుర్రవాణ్ణితన చేతుల్లోకి తీసుకొంది.

ఇంతలో గార్డు 'విజిల్' వేశాడు.

'టాటా' అనిపించి పిల్లవానిచే, చెయ్యి ఊపిస్తున్న రామారావుతో రైలు కదిలిపోయింది. చేతిలో 'కృష్ణపక్షం'తో నేను 'ప్లాటుఫారం' మీద మిగిలిపోయాను. ★

---




# సాలభంజిక - ప్రచారసాధనం

"పొదుపు పత్రాల ఉద్యమము అనుకొన్నంతగా విజయవంతము కాని కారణము ప్రజలలో సరిగా ప్రచారము కాకపోవటమే" అని పొదుపు ఉద్యమ కేంద్ర సలహా సంఘాధ్యక్షురాలైన శ్రీమతి, హన్నా సేన్, హైదరాబాదులో జూను నెలలో జరిగిన సమావేశములో అన్నారు.

పొదుపు పత్రాల ఉద్యమాన్ని గురించి బహిరంగ సభలలో ఉపన్యాసాలు, రేడియో ప్రసంగాలు జరుగుతునే ఉన్నాయి. పొదుపు ఉద్యమ కేంద్ర సంఘోద్యోగులు ఇంటింటికి వెళ్ళి, ప్రచారము చేస్తూనే ఉన్నారు. కాని సామాన్య ప్రజానీకములో దీనికి అనుకొన్నంతగా ప్రచారము కాలేదు.

సామాన్య ప్రజలకు ఈ ఉద్యమాన్ని గురించి 'పొదుపు పత్రాలంటే ఏమిటి? ప్రభుత్వము ఆ ధనముతో ఏమి చేయబోతున్నది? వాటివల్ల దేశానికి ఏ విధముగా లాభము? దేశ సౌభాగ్యము ఇనుమడిస్తే ఆ గ్రామస్థులకు కలిగే లాభము ఏమిటి?' మొదలైన అంశాలు వివరముగా తెలియపరచవలసి ఉంటుంది. ఈ అంశాలను కాగితములో వ్రాసి చదివినా, ఉపన్యాసాలను అప్పగించినా, ఆ గ్రామస్థులు ఇటు విని అటు విస్మరిస్తారు. ఫలితము అనుకొన్నట్టుగా పని సాగకపోవటమే. ఈ అంశాలనే పామరులకు కూడా మనసుకెక్కేటట్లు తెలుపగలిగితే, వాళ్లు కూడా అత్యుత్సాహముతో, ఈ ఉద్యమములో యథాశక్తి పాల్గొని, విజయవంతము చేయగలుగుతారు.

## ఇల్లిందల సరస్వతీదేవి

ఏ దేశములో నయినా, ఏ విషయాన్ని సామాన్య ప్రజలలో ప్రచారము చేయదలచుకొన్నా, దానికి అనువైన సాధనలను ఆశ్రయించక తప్పదు. గ్రామాలలోని సామాన్య ప్రజలను సులభముగా ఆకర్షించేవి జంగము కథల వీధి నాటకాలు తోలుబొమ్మలాటలు. మన పూర్వుల ప్రచారసాహిత్యము జానపదుల కర్థమయే శైలిలో గేయాలు, పదాలు పాటలరూపములో ఉండేది. ఈ సాహిత్యాని కనువైన సాధనలు తోలుబొమ్మలాటలూ వీధినాటకాలూను. వీటి సాయముంచే, మన పూర్వులు, పామరులలో కూడా విద్యా విజ్ఞాన ప్రచారముచేసి కృతకృత్యులయినారు.

ఈ సాధనలన్నిటిలో తోలుబొమ్మలాట చలన-చిత్రమువలె ప్రజా హృదయాన్ని చూరగొనగలిగినది.

సంతలో సరుకులు కొనటానికి వారానికొకసారి గ్రామాలనుండి వచ్చే ప్రజలకు ఎక్కడనుండో మద్దెలమ్రోత వినబడుతుంది. ఇంటికి కావలసినవస్తువులను కొన్న తరువాత, మిగిలిన పైకముతో, ఇల్లాలికి కుచ్చెకన్ను రవిక, పిల్లకు పూసలపేరు, పిల్లవాడికి మిఠాయిపొట్లము కొని, తృప్తిగా ఇంటిదారి పట్టే పల్లీయుడికి, ఈ మద్దెల చప్పుడుతో మనసు పొంగులువారి, ఆ లయకు అనుగుణముగా అడుగులు వేస్తూ దానిని సమీపిస్తాడు.

ఒక చెట్టుక్రింద చాపపరచుకొని, అర్ధకము దుప్పటితో తెరగట్టి, ఒడలు మరచే గానమాలాపిస్తూ ఉంటాడు - జం

(30 వ పేజీ చూడండి)



# సాలభంజిక - ప్రచారసాధనం



తలపాగా ధరించిన ప్రదర్శకుడు. తెరముందు, రంగముమీద దివ్యరోచిస్సులతో—కన్నబిడ్డను విశ్వామిత్రుడికి అందించబోతున్న మేనక, ఆమెను త్రోసి పుచ్చే తపోభంగమయిన విశ్వామిత్రుడూ, పదిముఖాలతో పకపక నవ్వుతూ విజయగర్వముతో సీతమ్మనపహరిస్తున్న రావణాసురుడూ, చీరకొంగు చింపుకొని తన నడవిలో వదలిపోయిన నలుడికొరకు విలపించే దమయంతీ, కనబడతారు. కంటిని చెదరగొట్టే ఆ చక్కని బొమ్మలూ, హృదయవిదారకమైన ఆ దృశ్యాలూ, దేహాన్ని మరపించే ఆ మధుర గానమూ ఆ పల్లీయుడికి చిరపరిచితమే-కాని అవి నిత్యనూతనములు!

ఆ బొమ్మలు కథాప్రారంభములో, ప్రాణము ఉన్నట్టుగానే కదలి, ఆడుతూ, అభినయిస్తాయి. ప్రాచీన రాజుల కథలు, ప్రేమికుల గాథలు, దేశచరిత్రలు, వీరుల జీవితాలను పౌరాణిక గాథలతోపాటు మనోరంజకముగా ప్రదర్శిస్తాయి. విషాద ఘట్టాల నడుమ, హాస్యపూరితమైన ఉపకథలతోను, సంభాషణలతోను, క్రుంగిపోయిన ప్రేక్షకుల హృదయాలను రంజింపచేస్తూ ఉంటాయి. ఆంధ్రదేశములో ప్రేక్షకులను కడుపు చెక్కలయేటట్లు నవ్వించగలిగిన పాత్రలు, కేతిగాడూ బంగారమ్మను. వీరి నిద్దరినీ ఎరుగనివారు ఉండరు.

మనసు నుఱ్ఱూతలూగించే ఆ కథలనూ పాటలనూ దృశ్యాలనూ విడిచి ఇంటికి వెళ్ళటానికి ఆ పల్లీయుడికి కాళ్లాడవు. ఆ రాత్రంతా అక్కడే ఉండి, ఆ ప్రదర్శనములోని ఆద్యంతాలనూ కని, విని, ఆనందించిగాని గృహోన్ముఖుడు కాడు.

వీటిని తోలుబొమ్మలనటము కంటె కీలుబొమ్మలంటేనే ఎక్కువ సమంజసముగా ఉంటుందేమో! ఈ బొమ్మలు కొయ్యతో చేసి, దానిపైన మట్టితోగాని, ప్లాస్టరుతోగాని, దేహనిర్మాణముచేసి అవయవాలను తీర్చి దిద్దుతారు. కనుక, వీటిని సాలభంజికలనవచ్చు. వీటికి చేతులూ కాళ్లూ కదలించటానికి అనువుగా కీలలు అమర్చితే కీలుబొమ్మలవుతాయి. కీలలుఉన్నా బొమ్మలు వాటంతట అవి కదలవు. ఈరోజులలో కీ ఇచ్చిన బొమ్మలు ఇల్లంతా గంతులు పెడతాయి; కారు గిర్రున ఇల్లంతా తిరిగివస్తుంది; చప్పట్లు కొట్టే బొమ్మలు, ఏడ్చే బొమ్మలూ అనేక రకాలు ఉన్నాయి. హైదరాబాదులో ఉన్న సాలార్ జంగు మ్యూజియమ్‌లో, ఒక మనిషిబొమ్మ, ప్రతి గంటకూ ఆ గడియారములో ఒక మూలనున్న డోలుమీద గంటలు కొట్టివస్తుంది. ఒక పెట్టెవంటి దానిలోనుండి రెండు పిట్టలు నాలుగుగంటలకొకసారి బయటికి వచ్చి కూత పెట్టి లోపలికి వెళ్లిపోతాయి. ఇవన్నీ మరలతో జరిగే పనులు. ప్రతి చలనచిత్రములోనూ లైఫ్ బాయ్ సబ్బుతో స్నానముచేసే బొమ్మ మరలతో నడిచి మనందరినీ ఆకర్షిస్తూనే ఉన్నది. ఈ కాలములో మరల అమరకము వల్ల వస్తువులకు కదలిక కలుగుతున్నది; కాని పూర్వము లేదుకదా! ఈ మరలు లేకపోయినా వాళ్లుకూడా బొమ్మలను కదలించి ఆడించారు. ఆ కాలములో మన పూర్వులు ఉపయోగించినది సూత్రము. ఈ సూత్రాన్ని ఒకచోట లాగితే అవి కదులుతూ ఉండేవి.

ఈ బొమ్మలకు వివిధ వేషాలు వేసి, వాటిని కథకు అనుగుణముగా రంగస్థలముమీద,అభినయింపచేసేవారు. ఆ అభినయానికి తగిన సంభాషణలు సంగీతము తెరవెనుకనుండి సమన్వయపరచి ప్రదర్శిస్తూ ఉండేవారు. ఈబొమ్మలాటను పప్పెట్ షో అనీ,బొమ్మను పప్పెట్ అనీ ఆంగ్లభాషలో అంటారు. పప్పెట్ అంటే ఒకరు కదిలిస్తే కదిలేది అని అర్థము. మన కీలుబొమ్మ ఆంగ్లేయుల పప్పెట్ ఒక అర్థాన్ని ఇచ్చేవే.

కీలుబొమ్మల ప్రదర్శనాలు అన్ని దేశాలలోనూ వాడుకలో ఉన్నాయి. ప్రాచీన కాలమునుండే చరిత్రలలో కనబడుతునే ఉన్నాయి. మనకు తోలుబొమ్మలను గురించిన వివరాలు ఆదివాఙ్మయములో లభిస్తాయని సాంఘికచరిత్రలవల్ల తెలుస్తున్నది. కీ. శే. సురవరము ప్రతాపరెడ్డిగారు రచించిన ఆంధ్రుల సాంఘికచరిత్రలోను క్రీడాభిరామములోను వీటిని గురించిన వివరాలు ఉన్నాయి. క్రీస్తుశకానికి పూర్వమే చైనాదేశములో లెత్సే అనే చారిత్రకుడు ఆకాలపు తోలుబొమ్మలను వర్ణించి, వాటి ప్రదర్శనాలను వివరించాడు. ఏడవశతాబ్దము నాటికే జావాలో ఛాయాచిత్రాలు ప్రచారములోకి వచ్చాయి. ఈ బొమ్మలు మొదట చైనాదేశములో పుట్టాయో, లేక భారతదేశములోనే పుట్టాయో ఇంతవరకూ ఎవరూ ప్రమాణముగా చెప్పలేదు. కాని వీటి పుట్టుకకు సంబంధించిన కథ ఒకటి మన ప్రాచీన సంస్కృతరచయితలు చెప్పినట్లు ప్రచారములో ఉన్నది. 'జగన్మాత అయిన పార్వతీదేవి ఉబుసుపోక అత్యంత సుందరమయిన భంజిక నొకదానిని సృష్టించినదట. ఆబొమ్మ సోయగము ఆమెనే చకితురాలిని చేసిందట. తాను సృష్టించిన బొమ్మే అయినా దానిలో దుష్టశక్తి లేమున్నవోనని ఆమె సంశయించి, దూరాన ఉన్న పర్వతము చాటున పాతిపెట్టటానికి బయలుదేరింది. దీనిని కనిపెట్టిన శంకరుడు కుతూహలముకొద్దీ, ఆమెను వెంబడించి, పాతిపెట్టబడ్డ ఆ బొమ్మను బయటికి తీయగలిగాడు. ప్రథమ వీక్షణములోనే ఆయన కెంతో ఆశ్చర్యానందాలు కలిగి, దానికి ప్రాణము పోసి భూలోకములోకి పంపాడట. ఈశ్వరాదేశముతో ఈ లోకములో ఈనాటికీ నిత్యనూతనముగా శోభిస్తున్నదా కీలుబొమ్మ' అని కథ. ఈ కథే నిజమయితే విద్యాబుద్ధులకు వినాయకుడిని ఆరాధించినట్లే, శిల్పచిత్ర కళానైపుణ్యానికి ఈ కీలుబొమ్మను ఆరాధించవలసినదే. దేవి సృష్టించటమూ దేవర ప్రాణము పోయటమూ సామాన్యమా మరి!

కీలుబొమ్మలు ఎంత సుందరముగా ఉంటాయో అంతగా హాస్యరస మొలికిస్తూ ఉంటాయి. అవి కదులుతూఉంటే మరింత హాస్యముగా ఉంటుంది. ఆకాలములో ప్రేక్షకులు వీటిని చూడటానికే ప్రత్యేకముగా వచ్చేవారు. ఆ ప్రదర్శనాలు ప్రేక్షకులను కేవలము నవ్వించేవే కాకుండా ఆహ్లాదాన్ని కలిగించి హాస్యముద్వారా నీతిని బోధించేవి. వీటిలో వ్యంగ్యముగా వేదాంతము అంతర్లీనమై ఉండేది. ముఖ్యముగా మన భారతదేశపు తోలుబొమ్మలాటలో ఆధ్యాత్మిక భావము ఎక్కువగా ప్రతిబింబించేది. దేవాలయాలలో ప్రతిష్ఠింపబడిన విగ్రహాలయెడ కలిగే భక్తిభావమే ఈ బొమ్మలయెడ కూడా కలిగేది. ప్రేక్షకజనానికి, ఈ ప్రదర్శనాలు దైవచింతనకు ఎంతో దోహదమిచ్చేవి. ఆ కాలములో నాటక ప్రదర్శనాలకంటె కూడా, ప్రాణరహితమైన ఈ బొమ్మల ఆటలు ప్రజలను అమితముగా ఆకర్షించేవి. అందుకే 'రంగస్థలముమీద నటుడు మాట్లాడి అభినయించిన దానికంటె, జీవములేని కొయ్యబొమ్మలు అభినయించగలగటము అతి విచిత్రము' అని బర్నార్డ్ షా అన్నాడు.

తోలుబొమ్మలను ఔత్తరాహులు పుత్లీవాలాలు (*Putliwallas*) అనేవారు. ఉత్తర హిందూస్థానములో యథార్థముగా జరిగిన కథలను అక్బరు కాలమునాటి చారిత్రక కథలను (బీర్బలు, తోడర్ మల్లు మొదలైనవారివి కూడా) లైలామజ్నూ కథలవంటి వాటిని ప్రదర్శించేవారు. ఈ ప్రద

ర్శనాలలో పాత్రలకు కథాకాలమునాటి వేషధారణ సంభాషణలను సమకూర్చేవారు. దక్షిణ దేశములో ఈ తోలుబొమ్మల ప్రదర్శనాలు ఎక్కువగా పౌరాణికగాథల ననుసరించి ఉండేవి. అందులో ముఖ్యముగా రామాయణ కథాఘట్టాలు, భారతకథాఘట్టాలు ప్రసిద్ధమైనవి. శ్రీరామచంద్రుడు ధర్మరాజు మొదలైన మహాపురుషుల గుణగణాలను ప్రజలకు చక్కగా బోధించేవి. ప్రాచీన కాలములో గ్రామీణుల జీవితాలలో ఎంతో ప్రాముఖ్యము వహించిన ఈ ప్రదర్శనాలు చలనచిత్రాల ప్రాబల్యముతో క్రమముగా తగ్గిపోవటము సంభవించింది.

సోవియెట్ యూనియన్‌లో కూడా తోలుబొమ్మలు ప్రసిద్ధమైనవే. రచయితలు గాయకులు చిత్రకారులు శిల్పులు శాఖలుగా ఏర్పడి థియేటర్లకు అనుబంధముగా పనిచేస్తూ ఉంటారు.

తోలుబొమ్మలను తయారు చేయటము చైనాదేశమే జపానుదేశానికి నేర్పింది. కాని—జపాను బంకారు (*Bunkaru*) భంజిక కళ ప్రసిద్ధికెక్కింది. జపాను తోలుబొమ్మ ఎత్తులో మనిషి ప్రమాణానికి సగానికి పైగా ఉంటుంది. ఈ బొమ్మలను ఆడించేవారు నల్లటి దుస్తులు ధరించినట్టుగా తెరవెనకనుండి రంగస్థలముమీదికి కనబడుతునే ఉంటారు. ఒక్కొక్క ముఖ్యపాత్రను నడపటానికి ముగ్గురు మనుష్యులు అవసరము. తల కుడిచెయ్యి కదిలించటానికి ఒకరూ, ఎడమ చేతిని కదిలించటానికి మరొకరూ, ఇంకొకరు కాళ్ళను నడపటానికి అవసరము. ఒక బొమ్మ కాళ్ళను నడపటానికి ఆకాలములో పదిసంవత్సరాల అభ్యాసము కావలసి వచ్చేదిట. అవిధముగా ముప్పయి సంవత్సరాల కాలము సాధనచేస్తేగాని ఆ విద్య అలవడదని అనేకుల విశ్వాసము.

ఈ బొమ్మలను కదిలించటానికి వాటి ముఖ్యావయవాలనుండి లాగటానికి వీలుగా తీగెలనుగాని దారాన్నిగాని అమరుస్తారు. కొన్ని బొమ్మలకు అయిదేసి తీగల అమరకముకూడా ఉంటుంది. ఈబొమ్మల ముఖాలు అందముగా, ఆకర్షణీయముగా, జీవకళ ఉట్టిపడేటట్టుగా ఉంటాయి. పాత్రోచితముగా కేశాలంకారముకూడా చేస్తారు. ఆడబొమ్మలకు తుమ్మెదరెక్కలవంటి నల్లటికురులు నొక్కులు నొక్కులుగా ఏర్పరచి ముచ్చటైన కొప్పూ, మగ బొమ్మలకు ముడిగాని క్రాపుగాని అమరుస్తారు. రాక్షసులకు పెద్దముక్కు, ఎత్తుపళ్లు, విరబోసిన తలజుట్టూ ఏర్పరుస్తారు. పాత్రల వేషధారణ సంభాషణ సంగీతముల సమ్మేళనము చక్కగా పాకానబడినట్లయితే (*Synchronisation*) అది తోలుబొమ్మలాటగా మనకు తోచదు; వాటికి ప్రాణము ఉన్నట్టుగానే భావన కలుగుతుంది. కనుకనే తోలుబొమ్మల ప్రదర్శనము ఒక గొప్ప కళగా భావింపబడ్డది.

ఈ కళానైపుణ్యానికి సంబంధించిన ఒక చైనాదేశపు చిత్రకథ ఉన్నది. క్రీస్తుశకానికి వెయ్యిసంవత్సరాలకు పూర్వము 'ము' అనే చైనాదేశపు చక్రవర్తి ఎన్సె అనే భంజికాదర్శకుడిని తన అంతఃపురానికి ఆహ్వానించాడట. రాజాహ్వానము నందుకొన్న ప్రదర్శకుడు అత్యుత్సాహముతో అతి విచిత్రమయిన బొమ్మలను తయారుచేశాడట. ఆ బొమ్మలు, చేతులూ కాళ్ళూ కదల్పటమే కాకుండా, అతి సహజముగా అధరస్పందనము చేస్తూ, కళ్లను కూడా త్రిప్పటము మొదలు పెట్టాయట. ఆ ప్రదర్శనము ఎంతో సహజముగా కనబడ్డది. వాటి నయనచాంచల్యము అతడికెంత సంభ్రమము కలిగించిందో - తన దేవేరులా దర్బారులో ఉన్నారని జ్ఞప్తికి రాగానే, అంత సంశయాన్ని కలిగించింది. వెంటనే చక్రవర్తి భంజికాదర్శకుడి తల నరకవలసినదని ఆజ్ఞాపించాడట. ఎన్సె విస్మయముతో చక్రవర్తికి నమస్కరించి, అవి కేవలము భంజికలని నిరూపించటానికి వెంటనే వాటిని నాశనము చేశాడట. చక్రవర్తి సిగ్గుపడి, అతడిని బహూకరించి పంపాడట.

పాశ్చాత్యదేశాలలో భంజికాప్రదర్శనాలు ఎక్కువగా వాడుకలో ఉన్నాయి. వారి ప్రదర్శనాలలో కొన్ని హాస్యపాత్రలు ఆటను రక్తికట్టిస్తాయి. మిస్టర్ పంచ్ పాశ్చాత్యుల ప్రముఖ హాస్యభంజిక. 17 వ శతాబ్దములో నేపుల్సు నగరములో మిస్టర్ పంచ్ జన్మించాడు. బెల్జియమ్‌లో కీలుబొమ్మల ప్రదర్శనాలు ఇప్పటికీ ఉత్సాహవంతముగా జరుపబడుతున్నాయి. అక్కడ ఒక మ్యూజియములో ప్రాచీనమైన భంజికలను కొన్నిటిని భద్రపరిచారు. అవి రంగస్థలమునుండి నిష్క్రమించి విశ్రాంతి తీసుకొంటున్న భంజికలట.

ఇది చలనచిత్రాల యుగము. నాటకకళను పునరుద్ధరించవలెనని ప్రజలలో ఒక సంచలనము తిరిగి పొడచూపుతున్నది. తోలుబొమ్మల ప్రదర్శనాలనుకూడా నాగరికత తిరుగదీస్తున్నది. పాతిక సంవత్సరాల నుండీ నాటకరంగానికి దర్శకత్వము చేసిన గాస్టన్‌బ్యాటే అనే ఫ్రెంచి నాటక దర్శకుడు, తోలుబొమ్మల ప్రదర్శనాలలో కృషి చేసి, ఒక థియేటరును నిర్మించటానికి గాను, నాటకరంగమునుండి విరమించుకొన్నాడట. 1946 నుండీ చకోస్లవేకియా తోలుబొమ్మలతో చిత్రాలను తయారుచేసి ప్రపంచఖ్యాతి గాంచినది. లాటిన్ అమెరికా గ్రామీణ పారిశ్రామికరంగము కొరకు యునెస్కోవారు స్థాపించిన ప్రాంతీయ ప్రధాన విద్యాకేంద్రములో ఆల్‌ఫ్రెడో గటీరెగ్ మొట్టమొదటిసారిగా బొమ్మలాట శాఖను ప్రారంభించిందని యునెస్కోవారి 'కొరియరు' పత్రిక ప్రచురించింది. ఈ ప్రదర్శనాలలో సులభగ్రాహ్యమయిన వాడుకభాషనే ఉపయోగించారట. జానపద సంగీత నృత్యాలతో మేళవింపబడిన ఈ ప్రదర్శనాల ద్వారా ప్రజలకు అక్షరాస్యతను కల్పించి, ఆరోగ్యసూత్రాలను, దేశపురోగమనానికి తోడ్పడే రాజకీయ విజ్ఞానాన్ని బోధిస్తున్నారని 'కొరియరు' పత్రిక ప్రకటించింది.

భారతీయులలో ఆధునిక విద్యావేత్తలు, విద్యాబోధ చేయటానికి ఈ భంజికాప్రదర్శనాలు ఉత్తమసాధనగా ఉపయోగపడతాయని అభిప్రాయపడుతున్నారు. ఈ ప్రదర్శనాలద్వారా విద్యావైజ్ఞానిక సాంస్కృతిక ప్రచారము ప్రాచీన కాలములో జరిగినట్లే, ఈనాడు కూడా చేయవచ్చునని విశ్వసిస్తున్నారు. పంచవర్ష ప్రణాళికల ఉపయోగాలను ప్రజలకు సుబోధకము చేయవచ్చునని గట్టి నమ్మకము కలిగింది.

తోలుబొమ్మలను తయారు చేయటమూ వాటి ప్రదర్శనాలను ఏర్పాటు చేసుకోవటమూ అతిసులభముగా స్త్రీలు నిర్వహింపగలరు. ఈ విషయాలను పొదుపు ఉద్యమ కేంద్ర సలహాసంఘము బాగా ఆలోచించి తమ ఉద్యమాన్ని విజయవంతము చేసుకోవలసి ఉన్నది. ★

తను ఊళ్లో ఉన్నంతకాలం భార్యను ఇలా కాపాడుకుంటూనే వచ్చేడు. పెళ్లి నప్పట్నుంచి ఇంటిపనన్నీ సవరిస్తూ ఆమె అతని కవసరమైన ప్రతి చిన్న పనిలోనూ సహాయ పడుతుండేది. ఎప్పుడూ అతను ఆమెతో కరుణతో మాట్లాడలేదు. పైగా వీలు దొరికినప్పుడల్లా హుంకాగా కోపంతో చీదరించుకుంటూ ఉండేవాడు.

షెరబతీ అందమయింది. ఆకర్షణీయంగా ఉంటుంది. నక్షత్రల్లా మెరిసే విశాలమైన కళ్లూ ఆమె మొహానికి నాజూగ్గా ఉంటుంది. నిండు యౌవనవతి. కిరపారామ్ భార్యగా ఉండడం కొంకిముక్కు దొండపండులా ఉంది. అతడు నల్లగా మోటుగా ఉంటాడు. అతని తిప్పటి ముంగం తుట్టపెదాలతో మరీ వికృతంగా కనిపిస్తాడు. అతని కదలికలో సౌమ్యము, హుందాతనం కనిపించవు. మూర్ఖత్వం మొరటుతనం ఇమిడి ఉన్నాయని అతన్ని చూడగానే తెలుస్తుంది. షెరబతీకి అతనితో చాల చిన్న వయస్సులోనే పెళ్ళి జరిగింది.

కిరపారామ్ తన సంపదను మురిసిపోయేవాడు. ఆ ఊరి ఖాతాదార్లకు ప్రభువు, భార్యకు అధినేత అయ్యాడు. వట్టి పిసినారి; దురాశా పిశాచి. ఒక్కసారిగ పెద్ద పెట్టుబడి దారుణ్ణవుదామనుకున్నాడు. అతనికి పెళ్ళాం ఒక పెద్ద సంపద.

కాని దేశం చీలిపోయినప్పుడు అతడు తన ఊరు వదిలేయక తప్పింది కాదు. ప్రాణంకన్న మిన్నగా ప్రేమించిన తన సంపదనంతా వదిలేయక తప్పింది కాదు. అతను కూడా తెచ్చుకోగలిగింది కొంత డబ్బూ, షెరబతీ మాత్రమే.

ఇద్దరూ కొన్ని నెలలు ఢిల్లీ రెఫ్యూజీ కేంపులో గడిపేరు. అక్కడ అద్దె ఇవ్వ నక్కరలేదు. భోజనం ఊరికే పెట్టేరు. తెచ్చుకున్న మూటలో డబ్బులో కానీ చెల్లకుండా భద్రంగా ఉందని అతను సంతోషించేడు.

కాని ఒక్క విషయం అతన్ని చాల బాధపెడుతుంది. షెరబతీని పరదాలో ఉంచటానికి వీర్పాటు లేదు. అందరూ ఆవిణ్ణి తేరిపార జూస్తున్నారు. ఆవిడ ప్రతి వస్తువునూ విచిత్రంగా, కొత్తగా చూస్తుంది. అదేదో మ్యూజియంకొచ్చి చూస్తున్నట్టు సంతోషపడుతుంది. ఆడాళ్లను మగాళ్లనూ చూస్తుంది. ఎదుటి గుడారంలో ఉన్న ముల్కరాజ్ ను చూస్తుంటే కిరపారామ్ కు మరీ బాధగా ఉంది. ఏమన్నా చేయగలిగే శక్తుంటే ఆ టెంటులోంచి అవతలికి నెట్టేద్దామనిపించింది అతనికి. అండమాన్సుకు పంపించేసేవాడే. ముల్కరాజ్, షేక్‌పురంనుండి వచ్చేడు. అతను ఇరవై ఆరేళ్ళ యువకుడు. ఆరోగ్యంగా, అందంగా, నాజూగ్గా ఉంటాడు. అందరితో కలుపుగోలుతనంగా ఉంటూ అందరికీ సాయం చేస్తూ ఉంటాడు. అందరూ అతన్ని ప్రశంసిస్తూ ఉంటారు. అతన్ని చిరునవ్వుతో పలకరిస్తూంటారు. కాని కిరపారామ్ కు అతను మోసగాళ్ళా కనిపించేడు. ఆడాళ్ళతో ఎందుకలా మాట్లాడ్తాడా అని అతనికి అనుమానం. షెరబతీని ముల్కరాజ్ తో మాట్లాడొద్దని అక్కతగిలి గద్దించినప్పుడు ఆవిడ చిరునవ్వుతో చెప్పే చిన్న సమాధానం మంట పుట్టించేది. సిగ్గుకు హద్దుదాటిపోయిందని చిరాకు పడ్డాడు. గట్టిగా తిట్టేడు. కాని షెరబతీ ఏమీ పట్టించుకున్నట్టు లేదు. ఆవిడ ముల్కరాజ్ తో సంతోషంగా మాట్లాడ్డంకూడా మానలేదు. ఇప్పుడు పెళ్ళాన్ని ముల్కరాజ్ తో నైతేనేమి మరొకళ్లతో నైతేనేమి మాటాడ్డం ఆపు చేయించడం ఎలాగు? అనేక తరహాల మనుషులు అక్కడ మసలుతున్నారు. పెద్ద మైదానంలో అనేక గుడారాలున్నాయి. అడ్డుగోడల్లేవు. బొత్తిగా చాటులేదు. అక్కడ అందరూ కష్టాలు పంచుకోడానికి వచ్చినట్టు కనిపిస్తుంది. ఎవరికీ సరిగ్గా తినన్ని వంటపాత్రలు లేవు. నిత్యం ప్రక్కవాళ్లనడిగి ఏదో ఒక పాత్ర తెచ్చుకుంటూ ఉండాలి. మరొకళ్ల సహాయం అనివార్యమైపోయింది. పల్లెటూళ్లనుంచి వచ్చినవాళ్లు తొందరగా ఒకళ్లకొకళ్లు పరిచయమై కలిసిపోగలరు. ఎరమరిక లేకుండా ఎరగనివాళ్ళనైనా, "వదినా! ఇప్పటికైనా కుటుంబానికి కలత లేకుండా ఉందా? అందరూ తప్పించుకు రాగలిగారా?" అని మాటలు కలిపేస్తారు. పట్నం నుంచి వచ్చిన ఆడవాళ్లదగ్గర ఈ విశేషం కనిపించదు. నాలుగు దుస్తులు వేసుకుని కొరడా కొయ్యల్లా తిరుగుతారు. తల ముసుగు అక్కర్లేదు వాళ్లకు. ఆరుబయట కుళాయిదగ్గర బట్టలుతుకుతారు. అక్కడే స్నానాలు చేస్తారు మగాళ్లలాగ. వాళ్లకు బొత్తిగా సిగ్గులేదు. ఇలాంటి వాతావరణంలో ఉండటానికి కిరపారామ్ కు మనస్కరించలేదు. తొందరగా అక్కణ్ణించి పోదామనుకుంటున్నాడు. అనేకసార్లు ఆఫీసర్లతో ఆడాళ్లగురించి మొరపెట్టుకున్నాడు. అప్పుడెప్పుడూ అంటూ ఉండేవాడు, 'ఇదంతా మన సాంప్రదాయాలకే విరుద్ధం, మన పెద్దల కట్టుబాట్లు అతిక్రమించడంవల్ల వచ్చే అనర్థాలు అనుభవిస్తాంలే' అని. అతని మాటల్నెవరూ పట్టించుకునేవారు కారు. అతను ఏదో అడ్డదిడ్డంగా వాదిస్తూ ఉండేవాడు. రెఫ్యూజీ ఏక్షన్ కమిటీ వాలంటీర్లు, పునరావాస సదుపాయాలను పరీక్షించడానికి వచ్చినప్పుడల్లా తాను మామూలుగా చెప్పటం మొదలుపెట్టేవాడు. "మాకున్న ఆస్తంతా పాకిస్తాన్‌లో పోగొట్టుకున్నాం. [illegible] బయటపడ్డాం కాని, [illegible] లేదు. ఆడాళ్లకైతే మరీ అధ్వాన్నంగా ఉంది. వాళ్లు నానాభిమానాలు పోగొట్టుకున్నారు." భర్త గొణుగుడు షెరబతీ సహించరానిదే అయింది. అతని మా



# అప్పుడూ, ఇప్పుడూ



త్యానికి షెర్‌బతీ ఎదిరించి వాదించింది. పెళ్లాంగొంతు పెద్దదైనందుకుమండిపోయేడు. తనఊళ్లో ఉంటేనా పెదాలు కదల్నిచ్చేవాడా. కాని ఇక్కడ విషయం రచ్చకెక్కుతుందని బాధపడ్డాడు. షెరబతీ మీద నోరు చేసుకున్నందుకు అందరూ చీవాట్లు పెట్టేరు.

షెరబతీ రోజులతో పాటు మారుతోంది. చుట్టూఉన్న ఆడాళ్లల్లా మారిపోతోంది. ఇదివరలో ఎప్పుడో అంత అవసరమొస్తేనే తప్ప ఎరగనివాళ్లతో మాట్లాడేదికాదు. ఇప్పుడు అందరితోనూ మాట్లాడుతుంది. పూర్వం ఎవరైనా కనబడితే చటుక్కున తలమీదికి ముసుగు లాక్కునేది. అలాంటి దిప్పుడేం చేయడంలేదు. కొత్తవాళ్లెవరైనా అదోలా చూస్తున్నా ఇప్పుడు సిగ్గు అభినయించడంలేదు. పూర్వచరిత్ర జ్ఞాపకం తెచ్చుకుని విచారించేది. మునుపు తనభర్త తలుపుసందులోనుండైనా అవతలి ప్రపంచాన్ని చూడనిచ్చేవాడు కాదు. తన హక్కు అడ్డడానికి మగాడికేలాంటి అధికారముంది?

అన్యాయంగా చెవొగ్గేవాళ్లను కూడగట్టి కిరపారామ్, ముస్లింలు చేసిన అఘాయిత్యాలు కథలుపెట్టి సినిమాకథల్లా చెబుతుంటే, షెర్‌బతీకి కిరపారామ్ తనను పెట్టిన చిత్రహింసలు కళ్లకు కడుతున్నట్టున్నాయి. ఒకరోజు తను, వేసారిన ఒంటరితనం, చీకటిఇల్లూ వీటితో విసిగిపోయి, ప్రపంచం చూడాలని నరకంలా పీడిస్తున్న ఆశతో బయటిప్రపంచాన్ని తలుపుసందులోంచి చూచింది. మరుక్షణం మగడు వచ్చి చూచేడు. జుట్టుపట్టుకుని లాక్కెళ్లి ఇష్టమొచ్చినట్టు బాదేడు. ఆబాధలు ఈ రోజునా షెరబతీగుండెల్లో మెదులుతునే ఉన్నాయి. నరకంలాంటి బ్రతుకు గడిపినందుకు తనకు జరిగిన అన్యాయానికి తిట్టుకుంది. ఇప్పుడు తను క్రొత్తగా ప్రపంచం చూచి సంతోషిస్తుంది. ఇప్పుడు ధైర్యంగా మొగుడికి ఎదురుసమాధానాలు చెప్పడం నేర్చుకుంది. అన్యాయంగా తనను అంత బాధపెట్టిన మగడు మరీ ఉడుక్కుచావాలని ముల్కరాజ్‌తో మాట్లాడుతుంది.

కిరపారామ్ ఆ వాతావరణానికి తట్టుకోలేక కొంపు వదిలేసేడు. పెళ్ళాం తనమీద అంత దురుసుగా ప్రవర్తిస్తుంటే మరీ సహించలేకపోయేడు. కరోల్‌బాగ్‌లో ఎలాగోలా ఒక చిన్నగది అద్దెకు తీసుకున్నాడు. గదిలోకి మారిం తరవాత అనేక చిక్కులకు గురికావలసివచ్చింది. ఇక్కడ ఊరికినే తిండి రావటంలేదు; ప్రతి చిన్న వస్తువుకోసం డబ్బు ఖర్చు చేయాల్సివస్తోంది. తనున్న చిన్న మూలికొంపకే అద్దెన్ను చెల్లించి మరీ రావలసివచ్చింది. ఇక్కడ బ్రతుకు మహాప్రియంగా ఉంది. తీరా ఆ గదిలో ఎందుకు దిగేనా అని బాధపడ్డాడు. కాని అతన్ని ఒక ఆశమాత్రం వెంటాడుతూనే ఉంది—ఎప్పటికైనా పాకిస్థాన్‌లో వదిలివచ్చిన ఆస్తికి గవర్నమెంటు కొంతైనా పరిహారం ఇవ్వకపోతుందా అని. కాని అంతవరకూ ప్రాణం నిలబెట్టుకోవాలిగా ఎలాగో ఒకలాగ!

బ్రతకడం మరీ కష్టంగా ఉంది. తనకు తెలిసినవాళ్లు కొంతమంది ఏవేవో పనులు చేసుకుంటున్నారు. ఒకడు చిన్న లాండ్రి పెట్టేడు. మరొకడు మిఠాయిలు అమ్ముతున్నాడు. వాళ్లెవరితోనైనా చేరి వాటా కుందామనుకున్నాడు. కాని ఎవరూ చేరనివ్వలేదు. వాళ్ళకా వ్యాపారాలవల్ల వచ్చేది కొంచెం, అందులో అతని కెలా వాటా ఇచ్చేది? అంతవరకూ అతన్ని పీడిస్తున్న కుటుంబ ప్రతిష్ఠకు చివరికొక దణ్ణం పెట్టేడు. ఇప్పుడు కరోల్‌బాగ్ వీధుల్లో కేకలేస్తూ పళ్లు అమ్ముతున్నాడు. కాని అతని కష్టాలు గట్టెక్కలేదు. వందలకొద్దీ రెఫ్యూజీలు జంగిళ్లలో పళ్ళమ్ముతున్నారు. కిరపారామ్‌కంటే ముందొచ్చినవాళ్లు ఆ ప్రాంతాల్లో బేరాలు ఆకట్టేసేరు. ఇక తన పళ్ళు అమ్ముడు కావడంలేదు. ఎప్పుడైనా ఎనిమిదణాలు అమ్మగలుగుతున్నాడు. నిజంగా ఒకరోజు పదిమూడణాలు సంపాదించేడు. ఆరోజు మరువరానిది. ఆరోజు రాత్రంతా కూచుని డబ్బులు లెక్కపెట్టుకున్నాడు, అదృష్టం అవరిస్తున్నట్టు సంతోషిస్తూ. ఇంతకు పూర్వం వేలకొద్దీ రూపాయిలు సంపాదించేడు. కాని ఇంత సంతోషం, ఇంత సంతృప్తి ఇదివరలో ఎన్నడూ అనుభవించలేదు.

కొన్ని మరీ దరిద్రపురోజులొచ్చేయి. అసలు అమ్మకాలే ఉండేవికావు. పళ్లు అలా కుప్పల్లా పడుండేవి చెల్లకుండా, కుళ్ళడానికి సిద్ధంగా. అన్నం వండుకోకుండా పెళ్ళాం తనూ పళ్లు తినేస్తుండేవారు. కాని ఒక్క పళ్లు తింటేనే సరిపోతుందా? రాను రాను కిర్‌పారామ్‌కు జబ్బు చేసింది. అజీర్ణరోగంతో రెండు నెలలు మంచానపడ్డాడు. చావవలసినవాడే, ఎలాగో బ్రతికేడు. కొంచెం కూడా కదలలేకపోయేడు. వాళ్ళ గదిదగ్గరనే ఒక హోమియోపతీ మందులషాపుంది. షెరబతీ రోజూ మందు తేడానికి అక్కడకు వెళ్ళేది. ఒక్కొక్కప్పుడు డాక్టర్ని పిలుచుకు వచ్చేది అర్జంటుగా. బయటికి తిరిగి తాను చెయ్యవలసిన పని పెళ్ళామే చేస్తుందే అని బాధపడ్డాడు. అలా పెళ్లాం బజారున తిరుగుతున్నందుకు తలతీసినట్టుంది. కాని తనేం చేయలేడు గదా! మంచంమీదనుండి కదలలేకపోతున్నాడు. ఓపికతో అణుకువగా షెర్‌బతీ అతనికి సేవచేస్తూనే ఉంది.

కిరపారామ్‌కు ఇప్పుడిప్పుడు . . . బలమొస్తున్నది. మంచానపడి ఇంకా సరిగా లేవలేకపోతున్నాడు. కాని అతనిలో ఇంకో పెద్దమార్పు వచ్చింది. అతనికిప్పుడు భార్యంటే గౌరవం మక్కువ హెచ్చవుతున్నాయి. అధికారపూర్వకంగా గట్టిగా కేక వేయడం మానేసేడు. మెల్లగా దండిస్తున్నాడు. అతని కళ్ళిప్పుడు నిజమైన స్త్రీ తత్వాన్ని చూస్తున్నాయి. ఆవిడ ముఖం ఎంతో సౌమ్యంగా తీయగా కనిపిస్తుంది.

షెర్‌బతీకి ఈ మార్పంతా చాల ఆశ్చర్యంగా ఉంది. అత నిప్పుడు తన నేమీ బాధపెట్టడంలేదు. ఇప్పుడామె సంతోషపూర్వకంగా సేవ చేయగలుగుతోంది. అతనికి బాగా విశ్రాంతి కలిగేలా పరిచర్యలు చూస్తోంది. ఆఖరుకు ఒకరోజు ఆమె భర్తను మళ్ళీ అడిగింది - "ముంగూ, బసంతీ, దేరా గుడ్డలు కుట్టడానికి వెళ్తున్నారు, నేనూ వెళ్లేదా?"

"నువు పనిచెయ్యడానికి వెళ్తావా?" కిరపారామ్ గద్గదస్వరంతో అనలేక అనలేక అన్నాడు.

"ఏం ఎందుకెళ్లకూడదేం? అందరికంటె నేనేం గొప్ప ఊడబొడిచేనని, నేనేం గొప్ప..." మెల్లగా చక్కగా చెప్పింది. కిరపారామ్ మాట్లాడలేకపోయేడు. అతనెంతో కలతపడుతున్నాడు - "మావాళ్లందరూ ఏమనుకుంటారు?" అని బరువుగా మెల్లిగా అన్నాడు.

"ఎవరన్నా అనడానికేముంది? ఎవరో అంటే ఏం ఒకళ్లనొకళ్లు పెద్ద తెలిసున్నవాళ్లెవరున్నారు. ప్రతివాళ్లు పొట్టకోసం ఏదో పనిలోకి జేరుతూనే ఉన్నారుగా?" అంది.

ఆరోజునుండి షెరబతీ బేరాలు కుడుతోంది. కొంతకాలం అందరూ పాటకజనమే అనుకుంటూ కొంచెం దూరంగా మసల్తూ పనిచేసేది. తాను అనుకుంటున్న తన ప్రత్యేకతను నిలుపుకోడానికి వాళ్లకి కొంతదూరంలో ఉండేది. కొంతకాలానికి ఈవ్యత్యాసం అనుకోకుండానే పోయింది. పనిలో ఉండేగౌరవం తనకు క్రమేణా అర్థమై మిగతా పనివాళ్లతో కలిసి తిరుగుతుందిప్పుడు. కిరపారామ్ స్వభావం ఇంకా మారింది. షెరబతీ ఇంకా ఆరోగ్యంగా బలంగా ఉంది. ఆవిడ ముఖంలో పట్టుదల ఏదో కార్యశూరత కనిపిస్తున్నాయి. ఏదైనా జగడం పెంచాలంటే అతనికి కారణం కనిపిస్తున్నా, మునుపటిలా క్రూరంగా మీదపడ్డానికి అతనికి ధైర్యం ఉండటంలేదు. ఆవిడ పవిత్రతనుగురించి, తనపట్ల ఆమె విశ్వాసాన్ని గురించి అనుమానించడం ఇప్పుడు చాల అసహ్యమైనదని తోస్తుంది.






# వానపాటలు

**పిలకా గణపతిశాస్త్రి**

## 1

ఒళ్లంతా జలు
జల్లనిపించే
చల్లగాలిలో ఆడుకుందాం.
పిల్లల్లారా! రండింక.

చెల్లీ, చంపకవల్లీ రావే,
కళ్లుమూసుకోవే!
మళ్లీ గిరగిర తిరుగుదా ముద్దుగా
పిల్లల్లారా! రండింక.

ఒళ్లంతా జలు
జల్లనిపించే
చల్లగాలిలో ఆడుకుందాం,
పిల్లల్లారా! రండింక,

## 2

రివురివ్వున వీచెడు
గాలి!
దవు దవ్వుల మబ్బులు
వాలి,
ఇలపై దిగె జలజల
వాన!
పులకించెనెద లో
లోన.

## 3

వానలింకా కొట్టి కురవాలి
వరి చేలు దండిగా పండాలి.

గాదెలన్నీ నిండిపోవాలి
భూదేవి సిరుల తులతూగాలి.

అమ్మమ్మ కమ్మగా వండాలి
హాయిగా మా బొజ్జ నిండాలి.

## 4

బంగారు పల్లకి
నింగిపై మెరసె.
రండిరండీ కనుల
పండుగీవేళ.

నీలిమేఘాలలో
మేళ తాళాలవే.
బాలబాలికలార!
ఆలింపరండీ.

వెండిజాలరులలో
కొండచుక్కలు మెరిసె
రండిరండీ కనుల
పండుగీవేళ.

(ఆలిండియా రేడియోవారి సౌజన్యంతో).



# దుప్పి కొమ్ములు

దుప్పి యొకటి ఏటికేగి
దప్పితీర నీరుత్రాగి
నీటిలోన ప్రతిఫలించు
నిజరూపము చూచుకొనెను.

చిలవలు పలవలుగ తిరిగి
బలముగ కడు పొడవు పెరిగి
సొంపులీను తనకొమ్ముల
సోయగమ్ముగని మురిసెను.

"చక్కని యీ కొమ్ములుంద
చచ్చుకాళ్ళు దేని"కనుచు
సన్నని తన కాళ్ళు చూచి
కన్నులు చిట్లించుకొనెను.

ఇంతలోన సింహనాధ
మెచ్చటిదో వినిపించెను.
ముప్పు కాచుకొనుటకొరకు
దుప్పి యంత పరుగెత్తెను.

కాళ్ళు తేలికైన వగుట
కడు రయమున పొదలు, పుట్ట
లన్నిదాటి, మృగరాజున
కందకుండ పరుగెత్తెను.

అంత నొక్కచోట కాట
కష్టముగా వ్రాలియున్న
తరు శాఖలలో కొమ్ములు
తగులుకొనగ నాగిపోయె.

గిలగిలమని చాలసేపు
గింజుకొనియె, నింతలోన
సింహమటకు వచ్చి దాని
సంహరించి కబళించెను.

ఈసప్ కథలు : 10

నండూరి రామమోహనరావు



నీతి

మనవారని నమ్ముకొన్న
జనులొక్కొక పరి శత్రువు
కాదు రనెడి మంచినీతి
బోధించును మీదిగీతి.

# నవరత్నాలు

తలిశెట్టి సభాపతిరావు

అవి భోజరాజు పరిపాలిస్తున్న రోజులు. ఆరోజుల్లో రత్నాల వ్యాపారం విరివిగా సాగుతూ వుండేది. ఇతరదేశాలనుండికూడా రత్నాలవ్యాపారులువచ్చి యథేచ్ఛగా రత్నాలను కొనడమూ, అమ్మడమూ కూడా వుండేది.

రానురాను ఈ రత్నాలవ్యాపారులలో మోసగాళ్లు బయల్దేరారు. ప్రజలను మోసంచేసి రత్నాలకు బదులుగా నకిలీరత్నాలను అమ్మి సొమ్ము చేసుకోవడం మొదలు పెట్టారు. కొన్నాళ్లు జరిగేటప్పటికి ఈసంగతి రాజుగారివరకూ వెళ్లింది. కాని రాజుగారు తొందరగా నమ్మలేదు. "అటువంటి మోసమే జరుగుతూవుంటే రత్నాల వ్యాపారం ఇంత ఉచ్ఛదశలోకి రావడానికి అవకాశమే లేదు. అయినా మేమే స్వంతంగా ఈ విషయాన్ని పరిశీలించి, ఈ రత్నాలవర్తకుల నిజాయితీని తేలుస్తాము" అన్నారు సభలో.

* • *

ఒకరోజున భోజరాజు ముసలి వేషంధరించి అంతఃపురంలోవున్న నవరత్నాలను ఒక సంచిలో వేసుకుని చేతికర్రతో దారి తడుముకుంటూ కోటలోనుండి బయల్దేరి రత్నాలవీధికి వచ్చారు. ఆరోజుల్లో రత్నాలూ, వజ్రాలూ అమ్మే బజారుకు రత్నాలవీధి అనేవారు.

దారితడుముకుంటూనే రత్నాల వీధిలో కొంతదూరంవెళ్ళి ఒక పెద్ద కొట్టువద్ద ఆగారు.

"ఏం? తాతా! మంచి ఎండలో వచ్చావు. ఏం కావాలి?" అంటూ ఆకొట్టు యజమాని ప్రశ్నించాడు. ఆయనపేరు రత్నాలశెట్టి. తండ్రి తాతలనుండీ రత్నాల వ్యాపారం చేస్తూ కోటికి పడగఎత్తినకుటుంబం. బజార్లో నమ్మకానికి పెట్టింది పేరు.

"ఏంలేదుబాబూ! నా దగ్గర కొన్ని రత్నాలుంటేను అమ్ముదామని తెచ్చాను." అంటూ తడుముకుంటూనే బొడ్డులోవున్న సంచి తీసి రత్నాలశెట్టికి అందించారు.

రత్నాలశెట్టి సంచిలో రత్నాలను దోసిట్లో పోసుకుని పరీక్షించి ఆశ్చర్యపోయాడు. అంత ఖరీదైన నవరత్నాలనుచూసి చాలసంవత్సరాలైంది. ముసలివానివంక చూశాడు. పరధ్యానంగా వున్నట్లు కనిపించాడు. ఆ రత్నాలను ఎలాగైనా కాజెయ్యాలన్న దుర్బుద్ధి పుట్టింది........

"తాతా! ఇవి ఎక్కడివి నీకు అని ప్రశ్నించాడు.

"అయ్యో! నాకెక్కడివి. మా తాతలకాలంనుండీ మా ఇంట్లో వుంటూవచ్చినయ్. ఈనాటికి మా సంసారం చిదికిపోయి, వాటి అమ్మే అవసరం వచ్చింది." అన్నాడ ముసలాయన ఎంతో బాధ పడ తూన్నట్లు.

"అయ్యో! పిచ్చితాతా! ఎంతో ఆశతో వచ్చినట్లున్నావు. ఇవి న రత్నాలు కావు. నకిలీవి. గాజ రాళ్ళతో సమానం. అంచేత వీటి

ఎవరు కొంటారు -ఇదిగో నీ సంచి. తీసుకు వెళ్లు" అంటూ సంచిని అందించాడు.

రత్నాలశెట్టి మాటలు ముసలి వేషంలో వున్న భోజరాజుకు ఎంతో ఆశ్చర్యాన్ని కలిగించినవి. మనసులో ఎంతో ఆరాటం బయల్దేరింది. అయినా బయటకు కనపడనీయకుండా, సంచిని అందుకుని "ఇన్నాళ్లూ వీటిని నవరత్నాలనుకుని ఎంతో ప్రాణపదంగా చాను. నకిలీ రాళ్లేనా!" అంటూ లేచి "వెళ్లొస్తా బాబూ!" అంటూ దారి తడుముకుంటూ బయల్దేరాడు.

"కళ్లు కన్పించవు కాబోలు. జాగ్రత్తగా ఒకప్రక్కనుండి వెళ్లు తాతా!" అంటూ తన అదృష్టానికి లోలోన పొంగిపోతూ, తాతను హెచ్చరించాడు.

తాత వెళ్లిన తర్వాత, తాను మార్చివేసిన నవరత్నాలను మళ్ళీ ఒకసారి కళ్లారా చూసుకుని, కళ్ళకద్దుకుని పెట్టెలో భద్రపరిచాడు.

ముసలివేషంలో వున్న భోజరాజు, కోటకు చేరి ఆత్రతగా సంచిలోని రత్నాలను తీసిచూశారు. ఆశ్చర్యం! అవి నవరత్నాలు కావు. వట్టి గాజురాళ్లు!! ఎంత మోసం? రత్నాలశెట్టి ఎంత నేర్పుగా నవరత్నాలనుమార్చివేశాడు. బహుశా దృష్టిలేని ముసలివాడుకదాఅని ఇంత దుర్మార్గానికి తలపెట్టి వుంటాడు. ఈ వర్తకప్రముఖునికి తగినట్టు బుద్ధి చెప్పాలని తలంచారు భోజరాజు.

* * *

ఈ సంఘటన జరిగిన మరుచటి రోజున, రాజావారు పట్టణంలో చాటింపు వేయించారు.

"మహారాణీవారి రాబోయే జన్మదినోత్సవ సందర్భంలో, మహారాజావారు ఒక నవరత్నఖచిత హారాన్ని బహూకరించ దలిచారు. అందుకు కావలసిన నవరత్నాలను తీసుకుని రత్నాల వర్తకులు ఫలాని రోజున దర్బారుకు హాజరు కావలసింది" అని.

ఈ చాటింపు విని రత్నాలశెట్టి ఆనందంతో గంతులు వేశాడు ముసలివాడిని మాయచేసి సంపాదించిన నవరత్నాలకు తగిన వెల దొరుకుతుందికదా అని.

నిర్ణయించబడిన రోజుకు రత్నాల వర్తకులంతా, తమ తమ వద్దగల నవరత్నాలను తీసుకుని దర్బారుకు చేరుకున్నారు. అందరితోబాటు రత్నాలశెట్టి కూడా వచ్చాడు చక్కని ముఖమల్ సంచిలో మోసంచేసి సంపాదించిన నవరత్నాలను తీసుకుని.

రాజావారు రత్నాల పరీక్ష ప్రారంభించారు. వరుసగా వర్తకులంతా తాము తెచ్చిన రత్నాలను చూపించారు. రాజావారు అందరి వద్దగల రత్నాలను పరీక్షించి, ఒక్క రత్నాలశెట్టి చూపించిన నవరత్నాలు మాత్రం నచ్చినట్లు ప్రకటించారు.

"రత్నాలశెట్టీ! నువు తెచ్చిన నవరత్నాలు మాకు నచ్చినవి. అంతఃపురానికి పంపించి, మహారాణీవారు కూడా సరేనంటే ఖరీదు ఖాయంచేద్దాము" అన్నారు.

"చిత్తం! మహాప్రభూ అలాగే

# ★ నవరత్నాలు ★

"కానివ్వండి" అన్నాడు అమితా నందంతో.

మరో పావు గంటకల్లా నవ రత్నాలను అంతఃపురంలోకి తీసుకె ళ్ళిన దాసి తిరిగివచ్చి "మహా ప్రభూ! ఇవి నవరత్నాలు కావట. నకిలీరత్నాలు మాత్రమేనట. దేశ మంతా గాలించి అయినా నవ రత్నాలనే తెప్పించమని మహా రాణీగారి కోరిక" అని వెల్లడిం చింది.

కోటి రత్నాల వర్తకులతో నిండివున్న నిండు దర్బారులో అలా ప్రకటన చేయడం రత్నాల శెట్టికి తలకొట్టినట్లయింది.



"అదేమిటి ప్రభూ! అలా శల విచ్చారు. అవి జాతిరత్నాలో రాళ్లో ప్రభువులు మునుపే చిత్తగిం చారుకదా! అవి నిజమైన జాతి రత్నాలు. అవసరమనుకుంటే ప్రభువులు మళ్ళీ చిత్తగించండి" అంటూ సంచిలోని రత్నాలను అర చేతిలో పోసుకున్నాడు.

పాపం! చేతిలో వున్నవి తాను తెచ్చిన నవరత్నాలు కాక, ఆనాడు ముసలితాత సంచిలో పోసి ఇచ్చిన నకిలీ రత్నాలు కావడంతో తెల్ల బోయాడు. చేతులు వణికినవి. కాళ్ళకింద భూమి ఆడుతున్న ట్లైంది. జరిగిన మార్పును అర్థం చేసుకోవడానికి అతనికి ఎంతో సేపు పట్టలేదు. ఆనాటి తాత ఎవరా? అన్న సందేహం కలిగేసరికి అతనికి గుండె ఆగిపోయింది!!

భోజమహారాజు, రత్నాల శెట్టిలో వచ్చిన మార్పును జాగ్ర త్తగా చూస్తూనేవున్నారు.

"ఏం శెట్టీ! అలా అయిపో యావు. ఏం జరిగింది" అన్నారు.

"ఏం లేదు ప్రభూ! ఏం లేదు. కంటైతే కళ్లొస్తాను" అన్నాడు తల వంచుకుని.

పాపం! రత్నాలశెట్టి అవస్థ చూసి భోజరాజుకు పట్టరాని నవ్వు వచ్చినా ఆపుకుని "సరే!" అన్నారు.

రత్నాలశెట్టి బ్రతికాను దేవుడా అనుకుని బయల్దేరాడు. నాలుగడు గులు వేశాడో లేదో మహామంత్రి లేచి "ఆగవోయ్! శెట్టీ!" అని గద్దించాడు.

రత్నాలశెట్టికి పీక నొక్కినంత పనైంది. అక్కడే అలాగే నిలబడి పోయాడు!

"ఏం శెట్టీ! ఇప్పటికైనా నువ్వు చేసిన మోసాన్ని ఒప్పుకుంటావా? లేదా?" అన్నారు.

"చిత్తం! బుద్ధి గడ్డి తిన్నది. ప్రభువులు కరుణాసముద్రులు. రక్షించాలి" అంటూ మహారాజు గారి కాళ్లమీద పడ్డాడు.

అప్పుడు మహారాజు లేచి దర్బా రులో వున్నవారందరికీ జరిగినసంగ తంతా వివరంగా చెప్పి ఇలా అన్నారు "ఈ రత్నాలశెట్టి చేసిన మోసానికి తగినట్లు బుద్ధిచెప్పాలను కున్నాం. అందుకే ఈ పథకం ఏర్పాటుచేశాం. మా నవరత్నాలు మాకు సురక్షితంగా చేరినవి. ఇత నికి కోటి వర్తకుల్లో తగిన పరా భవం అయింది. ఈ విషయం వాడ వాడలా దేశదేశాలా తెలుస్తుంది. అతని కా శిక్ష చాలని మా అభి ప్రాయం. కాని, ఇకముందు ఇలాంటి మోసాలు చేసినట్లు ఫిర్యా దులు వస్తే ముక్కూ చెవులూ కోయిస్తాం. జాగ్రత్తగా వ్యవహ రించండి" అంటూ దర్బారు చాలిం చారు.

అది విన్న వర్తకులంతా భయంతో ఎవరి ముక్కు, చెవులను వారు తడుముకున్నారు!!

మహారాజు అన్నట్లే రత్నాల శెట్టి మహారాజును మోసగించిన విషయం దేశదేశాల ప్రాకింది. అతడు మోసగాడన్న సంగతి తెలి సిన తర్వాత అతని వ్యాపారం క్షీణించింది.—

★




## 22

బ్లాంకార్డ్ శిథిల కుటీరానికి పోవటానికి షావలిన్ సన్నద్ధుడైనాడు: సైనికుడొకడు తెచ్చియిచ్చిన సైనిక దుస్తులుధరించాడు. డెజ్‌గాస్‌ను పిలిచి చెప్పాడు.

"వెంటనే నీవు కెప్టెన్ జట్టివద్దకుపోయి మరొక డజను మంది సైనికులను వెంటబెట్టుకొనిరా. వచ్చేటప్పుడు సెంట్ మార్టిన్ రోడ్డు వెంటరా. నేను ఇప్పుడు పికెబండిలో పోతాను. దారిలో వచ్చి కలుసుకో. బ్లాంకార్డ్ కుటీరం దగ్గర కొంచెం గట్టిపని తగలవచ్చు. పింపర్నెల్—అది ధైర్యమో, మొండితనమో అసలో గాని మొదట వేసుకున్న పథకం ప్రకారమే చేస్తాడు. డీటూర్నే, సెంట్ జస్ట్ మొదలయిన వారినందరిని కలుసుకోవటానికి పోయిఉంటాడు పింపర్నెల్. వారందరూకూడా కత్తిత్రిప్పటంలో మొనగాళ్లే. అందుచేత కాస్త జాగ్రత్తగా ఉండటం మంచిది. తెచ్చేసైనికులను చూసి తీసుకురా ఏం?"

డెజ్‌గాస్ తల ఊపాడు. చెప్పినపని చేయటానికి బయలుదేరి వెళ్లాడు.

మరికొన్ని నిమిషాలలో మార్గరెట్‌కు మళ్ళీ యూదు కంఠస్వరం వినిపించింది. షావలిన్‌ను వాడు బండిదగ్గరకు తీసుకుపోయినాడు. బండి బయలుదేరింది. రోడ్డు గతుకులవెంట కిర కిరలాడుతూ, బండి కదిలింది.

హోటలు లోపల అంతా నిశ్శబ్దమైంది. షావలిన్‌ను చూడటంతోనే అదురెత్తిపోయిన బ్రోగార్డ్, అతనిభార్య లోపల ఏ మూల గదిలోనో పత్తా లేకుండా ఒదిగి కూర్చున్నారు. ఒకటో రెండో క్షణాలు తటపటాయించి, మార్గరెట్ క్రిందికి దిగివచ్చింది. కళ్లని పైగుడ్డ ముసుగు వేసుకున్నది. హోటలు బయటికి వచ్చి బండి వెనక బయలుదేరింది.

బాగా చీకటిగా ఉన్నది. వారికి కనపడి పోతానేమో నన్న భయంకూడా మార్గరెట్‌కు లేదు. రోడ్డుకు రెండు ప్రక్కలా పొదలు ఒత్తుగా గుబురుగా ఉన్నాయి. వాటిని చాటుచేసుకొని పోతే ఇక ఇబ్బందే ఉండదు అనుకున్నది మార్గరెట్.

ఇన్నాళ్ళు పట్టిన అవస్థలమారి ప్రయాణంలో ఇది చివరి అధ్యాయం. అటో, ఇటో తేలిపోతుంది.

తన గుర్రము, బండిగురించి యూదు ఎంత గొప్పగా చెప్పుకున్నా, అదిమాత్రం ఈ గతుకుల రోడ్డుమీద తొందరగా నడిగట్టి వస్తుందా ఏమిటి? తాను ఆ మాత్రం దానితో పోలేదా? అని ధైర్యం తెచ్చుకొన్నది. అదృష్టవశాత్తు బాగా మబ్బుకూడా పట్టిఉండటంచేత వెన్నెల రాత్రుల లాగా లేనేలేదు. గాఢాంధకారం అలముకొని ఉన్నది.

ఆ బ్రోగార్డ్ హోటలులో- ఆ చీకటి గుయ్యారంలో, ఆ దుర్గంధకూపంలో ఇంతసేపు పడిఉన్న మార్గరెట్‌కు చల్లగా సముద్రపుగాలి తగిలేసరికి ప్రాణం లేచివచ్చినట్లయింది. అంతా ప్రశాంతంగా ఉన్న ఆ వాతావరణంలో ఆఖరుకు ఎండుపుల్లమీద కాలు పడినా, ఆ చప్పుడు బండిలోఉన్న షావలిన్‌కు వినిపించ

వచ్చు. అందుచేత ఆమె బండికి కొంతదూరంగానే నడవసాగింది.

గుఱ్ఱపుబండి ఊగుతూ, తూగుతూ, కిరకిర లాడుతూపోతున్నది. గుఱ్ఱం అయిష్టంగా, నిద్రపోతూ కాళ్ళీడ్చుకుంటూ బండి లాగుతున్నది. బండిలో కూర్చున్న షావలిన్ ఊహాలుమాత్రం జోరుగా పరుగెత్తుతున్నాయి. బ్లాంఛార్డ్ శిథిల కుటీరందగ్గర జరగబోయే సంఘటనలు షావలిన్‌కు దృశ్యాదృశ్యంగా రూపు కట్టుతున్నాయి. తృప్తిగా, సంతోషంతో షావలిన్ అరచేతితో గడ్డం రుద్దుకుంటూ కూర్చున్నాడు.

షావలిన్ జీవితంలో ఇది మహత్తరమైన రోజు. పింపర్నల్‌ను బరిమీద పట్టుకుంటే, ఇంగ్లీష్ ప్రభుత్వం మాత్రం ఏమిచెయ్యగలదు? పింపర్నల్‌ను పట్టుకుంటే ఫ్రాన్స్ ప్రజలు తనకు నీరాజనాలర్పిస్తారు. షావలిన్ జేబులో ఉన్న బంగారు నాణెములమీద మనసుంచి, యూదు పరధ్యానంగా బండి తోలుతున్నాడు.

పదినిమిషాలకు, పావుగంటకు ఒకసారి షావలిన్ "ఏం? ఎందాకా వచ్చాము?" అని అడుగుతూనే ఉన్నాడు. "ఇదిగోవచ్చేశామండి." అని యూదు సమాధానం చెప్తూనే ఉన్నాడు.

"దారి ఇదేనా? నీకు బాగా గుర్తుందా?"

"ఇదేనండి బాబు."

ఇంతలో నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ దూరంగా అశ్వికులెవరో వస్తున్నట్లు ధ్వని వినిపించింది. యూదు నిలువునా వణికిపోతూ "బాబోయ్! సైనికులు?" అన్నాడు.

"ఒకనిమిషం బండి ఆపు చెప్తా!" అన్నాడు షావలిన్.

సైనికులు వస్తున్నట్లు మార్గరెట్‌కు కూడా వినిపించింది. మొదట డెజ్‌గాజ్ సైనికులను వెంట బెట్టుకొని షావలిన్‌ను కలుసుకోవటానికి వస్తున్నాడేమో ననుకున్నది. కాని చప్పుడు ఆ ప్రక్కనుండి కాక ఎదురుదిక్కునుండి వస్తున్నది. కాబట్టి ఏదో విశేషం ఉండి ఉంటుందని మార్గరెట్ ఊహించింది. చల్లగా బండిదగ్గరకు చేరుకొని ఒక పొదమాటున నక్కింది.

పొడుగాటి విదేశీయు డెవరైనా కనిపిస్తే వచ్చి తనకు తెలియజేయాలని షావలిన్ ఆదేశం. అందుచేత పెర్సీ ఎక్కడో కనిపించబట్టే వారు వస్తున్నారని మార్గరెట్ తలిచింది.

ఇద్దరు సైనికులు హుటాహుటివచ్చి బండిదగ్గర ఆగారు. "ఏమిటి సంగతి? విదేశీయుడు కనిపించాడా?" అని అడిగాడు షావలిన్.

"లేదండి మేము ఆ పర్వతశిఖరం ప్రక్కగా వస్తున్నాము."

"ఊఁ! విశేషం ఏమిటి?"

"ఇక్కడికి ఒక కోసెడుదూరంలో ఒకచోట మొండి కొయ్య దుంగలతో నిర్మించిన కుటీరం ఒకటి కనిపించింది. బెస్తవారు తమ వలలు అవీ దాచుకొనే గుడిసెలాగా ఉన్నది ఆకారం. మేము మొదట చూసినప్పుడు అది ఖాళీగానేఉన్నది. అందుచేత ఏమీ అనుమానం పడకుండా వచ్చేశాము. తరువాత కొంతసేపటికి అక్కడ పొగ కనిపించింది. వెంటనే నేను గుఱ్ఱము దిగి మెల్లిగా ప్రాకుకుంటూ ఆ కుటీరం సమీపించాను. అప్పుడుకూడా అది ఖాళీగానే ఉన్నది. తరువాత కొంతసేపటికి ఇద్దరు మనుష్యులు—ఒకడు వృద్ధుడు—మరొకడు యువకుడు, అక్కడకువచ్చారు. ఇద్దరు లిల్లీరోడ్డుమీదుగావచ్చారు. ఆ కుటీరంలో దూరారు. అక్కడ వారు మాటాడుకుంటూ ఉండగా మధ్యమధ్య కొన్నికొన్ని ముక్కలు వినిపించినాయి."

"ఏమిటి చెప్పు తొందరగా."

"ఆ వృద్ధుడు 'ఇక్కడికేనా మనము రావలసింది? ఏమి పొరపాటు పడలేదుకదా!' అని అడిగాడు. ఆ కుఱ్ఱవాడు 'పొరపాటేమీలేదు. పింపర్నల్ వేసియిచ్చిన ప్లాను ఇదుగో చూడండి' అన్నాడు. అప్పుడు బహుశా నేను ఏదో అలికిడిచేసి ఉంటాను; ఆ యువకుడు బయటికివచ్చి, చుట్టూ చూసివెళ్లాడు. ఆ తరువాత వారు చాలా మెల్లిగా మాట్లాడుకున్నారు నాకేమీ వినిపించలేదు."

"నీవేం చేశావు అయితే?'

"మేము మొత్తం ఆరుగురమున్నాము ఆ ప్రాంతంలో గస్తీ తిరుగుతూ. నలుగురు అక్కడే ఉన్నారు. మే మిద్దరం తమతో మనవిచేద్దామని పరుగెత్తుకు వచ్చాము."

"ఆ కుటీరం ఎంతదూరముంటుందన్నావు?"

"కోసెడు."

"సరే!" నీవు మా వెంట రా ఆ కుటీరానికి దారితియ్యి. రెండవ అతడు ఈ రెండుగుఱ్ఱాలు తీసుకొని పోతాడు. కుటీరం ఇంకొక పావుమైలు ఉందనగానే చెప్పు బండి అక్కడ ఆపేద్దాం."

పావలిన్ ఆజ్ఞప్రకారం సైనికులను వెంటబెట్టుకొనివచ్చి, ఇంతలో డెజ్ గాజ్ అక్కడికి చేరుకున్నాడు. బండి బయలుదేరింది. సైనికులు వెనుక నడిచారు.

మార్గరెట్ ఆశలు పూర్తిగా భగ్నమైపోయినాయి. అంత్య సమయంలోనైనా పెర్సీని చూడాలనే కోరికతో వారిని అనుసరించింది.

## 23

బండి ఆగింది. పావలిన్ దిగాడు. రోడ్డు కుడిప్రక్కన ఒక కాలిబాట కనిపిస్తున్నది.

పావలిన్ తన వెంటవచ్చిన సైనికులకు ఏవో ఆజ్ఞలిస్తున్నాడు. వాటిని శ్రద్ధగా వినాలనే కుతూహలంతో, మార్గరెట్ తెగించి సమీపించింది. పావలిన్ వెనుకగా ఒక గజందూరంలో ఉన్న ఒక పొదమాటున నిలబడింది.

ఇందాకటినుండి దారిచూపిస్తున్న సైనికుని మెల్లిగా ప్రశ్నించాడు పావలిన్.

"బ్లాంబార్డ్ కుటీరం ఎక్కడ ఉన్నది?"

"ఈ కాలిబాట వెంటనే ఒక అరఫర్లాంగు దూరం పోవాలండి. ఆ కనిపించేగుట్ట ఎక్కి మలుపు తిరిగి పోవాలి.

"సరే, నీవే దారితీద్దువుగానిలే ఉండు మీరందరూ నేను చెప్పేది శ్రద్ధగావినండి. ఇకమీదట మనము మాటాడటానికి కావలసిన అవకాశం కుదరకపోవచ్చు. జాగ్రత్తగా వళ్లుదగ్గరపెట్టుకొని వినండి. మీ ప్రాణాలన్నీ దీనిమీదనే ఆధారపడి ఉన్నాయి. మీలో కొందరు ఆ కుటీరం దగ్గరకు ప్రాకుకుంటూ పోవాలి. అందులో ఆ ప్రభువంశీకులు మొదలయిన ద్రోహులెవ్వరైనా ఉన్నారో లేరో చూడండి. ఆ ఇంగ్లిష్ వాడుకూడా అందులో ఉన్నట్లయితే, ఈలవేసి తక్కిన వారినందరిని హెచ్చరించండి. మీరందరూ కలిసి అమాంతం ఆ కుటీరంవద్దకు పరుగెత్తుకొనిపోయి వారిని పట్టుకోండి. వారు పోరాటానికి సిద్ధపడితేమాత్రం, కాళ్లమీదనే కాల్చండి. వారినందరిని సజీవంగానే పట్టుకోవాలి. తెలిసిందా? ముఖ్యంగా ఆ ఇంగ్లీషువానిని మాత్రం చంపనేకూడదు. ఏం?"

"అలాగేనండి."

"ఆ ఇంగ్లీషువాడు చాలా పొడుగుగా ఉంటాడు. బహుశా చాలా బలంకూడా ఉంటుంది, అందుచేత అతనిని పట్టుకోవటానికి ఇద్దరో, ముగ్గురో. ఇంకా అవసరమైతే నలుగురో కలిసి ప్రయత్నించండి. ఆ ఇంగ్లీషువాడు ఇంకారాక, ఆ ద్రోహులుమాత్రమే కుటీరంలో ఉండేటట్లయితే, మీరందరూ జాగ్రత్తగా, చప్పుడుచేయకుండా ఆ సమీపంలోని కొండరాళ్ల మాటున నక్కుకొని కూర్చోండి. ఆ ఇంగ్లీషువాడు వచ్చేదాకా అలాగే ఉండాలి. అతడు కుటీరంలో దూరేదాకా ఎవ్వడూ కదలవద్దు. ఆ తరువాత ఒక్కసారిగా పోయి పట్టుకోవాలి. చెప్తున్నా—మీరు ఎంతో నిశ్శబ్దంగా వేచిఉండాలి. ఏ మాత్రం అనుమానం తగిలినా అతడు తప్పుకు పోవచ్చును. ఈ రాత్రి మనం నెరవేర్చవలసినపని అతనిని పట్టుకోవటమే. అదే మన ప్రధాన కర్తవ్యం."

"అలాగే చేస్తాం."

"సరే ఒకరొక్కరే బయలుదేరండి. చప్పుడు గాకుండా నడవండి"

ఇంతసేపు యూదు ఏమిచేయాలో తోచక వెఱ్ఱిముఖం వేసుకొని నిలబడ్డాడు. సైనికులందరూ బయలుదేరిపోతున్నారు. డెజ్ గాజ్ పావలిన్‌కు గుర్తుచేశాడు. "మరి ఆ యూదుమాట ఏమిటి?"

"అన్నట్లు, మరిచిపోయినాను. ఏయ్! ఇలారా! నీ పేరేమిటో నిన్న"

"చిత్తంబాబూ! నాపేరు బెంజమిన్ రోజెన్ బేమ్."

"ఏదో ఒకటిలే! నోరుమూసుకో! మేము ఇలా వెళ్లివస్తాము. వచ్చేదాకా, నీవు, నీ బండితో సహా ఇక్కడనే ఉండాలి. ఏ కారణంచేతనైనా నీవు కొంచెము చప్పుడు చేసినావో, ఇక్కడినుండి కదిలినా సరే ఏమవుతుందో తెలుసా? నీ తాటవలిపిస్తాను."

"అదికాదండి."

"కాదు లేదు, అవును లేదు నోరుమూసుకో."

సైనికులంతా వెళ్ళిపోయినారు. డెజ్ గాజ్, పావలిన్, యూదుమాత్రమే మిగిలిపోయినారు. పావలిన్ కూడా బయలుదేరిపోవటానికి తొందరపడుతున్నాడు.

# 4. నవప్రభాతం

ప్రతి దినమూ ఆకాశపు తూరుపు కొనపై తెలి తెలి వెలుగులు తోచీ తోచగానే, ఆనందంతో నృత్యం చేస్తున్న వనలక్ష్మి కాలి గజ్జెల సవ్వడిలాగ, చిన్న చిన్న పక్షుల జిలిబిలి పలుకులనందడి జడి జడిగా వనమంతటా వర్షిస్తుంది. పక్షుల గుంపులు చెట్టు చెట్టుకూ ఎగిరి పాటమీద పాటగా, ఆట మీద ఆటగా పరవశించి పరుగులు తీస్తాయి. సూర్యదేవుడు ఏడు గుర్రాల రథంమీద ప్రపంచసంచారానికి బయలుదేరుతున్నాడనీ, క్షణంలో లోకమంతా ప్రభాత కాంతులలో స్నానంచేసి పులకించి పోతుందనీ పక్షులు ఒకదానికొకటి గుసగుసలాడుతూ చెప్పుకుంటాయి. ఉదయసమయం అంత సుందరమైనది మరి!

ఒక ఉడత రాత్రిఅంతా మేలుకుని పొడలిపాముతో జూదమాడి నిద్రపోయింది. తెల్లవారుతున్నా ఇంకా లేవలేదు. పక్షుల కలకలా రావాలతో దానికి నిద్రాభంగం అయింది. నిద్ర చెడినందుకు కోపంతో ఇలా అంది:

"ఉదయం, ఉదయం—ప్రతి రోజూ ఉదయం ఉన్నదేకదా! అందులో వింత ఏమున్నది? చీకటి పోగా వెలుతురు రాక మానుతుందా? దానికి ఇంత రభస దేనికి? పొండి పొండి పక్షుల్లారా! మీ గూళ్లకు పోయి పడుకోండి. నా నిద్ర చెడగొట్టకండి."

కలకల శబ్దాల కోలాహలంలో మునిగిఉన్న పక్షులు ఉడతమాటలు విననేలేదు. కాని ఒక వృక్షం విన్నది. దానికి కోపం వచ్చింది:

"ఇదిగో, స్నేహితుడా! నువ్వు ఏమన్నా ఊరుకొంటాను గాని ప్రభాత సౌందర్యాన్ని దూషిస్తే మాత్రం ఊరుకునేది లేదు. ప్రాతఃకాలం పాతబడే సరుకు కాదు. తెలుసుకో!"

"అవును, నిజమే," అని ప్రక్కన ఉన్న గండశిల ఒకటి అన్నది: "శాస్త్రజ్ఞులు చెప్పేది నిజమయితే, నేనిక్కడ అయిదు లక్షల సంవత్సరాలనుండీ ఉంటున్నానన్న మాట. కాని ఇంత దీర్ఘకాలంనుంచీ ప్రతి రోజూ చూస్తూనే ఉన్నా, ఈ ప్రాతఃకాల సౌందర్యం పాతబడలేదు; ఎన్నిసార్లు చూసినా నాకు విసుగనిపించలేదు."

"నిజం నిజం! నిత్యనూతనం ఈ ప్రభాతం!" అని తటాలున తటాకంలోని మండూకం పైకి వచ్చి బెకబెకలాడింది.

రెక్కలపురుగొక్కటి రివ్వున వచ్చి "ఉదయం అంటే విసుగు ఎవరికి? ఆ వెధవ ఉడతకేనా? ఛీ, ఆ మాట అనడానికి సిగ్గు లేదూ?" అన్నది.

ఇంతలో గగనభాగం అంతా లేతగులాబీరంగులు వ్యాపించాయి. భూభాగం అంతా పచ్చని తివాచీ పరిచినట్లు ప్రకాశించింది. పక్షుల ప్రభాత సంగీతం జలపాతంలా హోరుహోరున మారుమ్రోగింది. జగద్బాంధవుడు సూర్యుడు ఎర్రదనం ముద్దకట్టినట్లు తెల్లని మబ్బు తెరల వెనకనుండి దర్శనమిచ్చాడు. జగమంతా ఒక్క నేత్రమై సూర్యుని వైపే తిరిగింది. సూర్యుడు మబ్బుల పరదాలు ఒత్తిగించుకుని తల ఎత్తి చూశాడు. కొంటెగా ఎవరినో ఏడిపించాలనుకున్నట్లు, ముఖ్యంగా పక్షులను గిల్లి, ఏడిపించాలనుకున్నట్లు కనిపించాడు. వెంటనే పక్షులన్నీ కిలకిల నవ్వుతూ, ఆకాశపు నలుమూలలకూ పారిపోయాయి.

మొదట విసుగుపడిన తుంటరి ఉడత కూడా లేచి, కళ్లు నులుముకుని "అబ్బ, ఎంత అందంగా ఉన్నది ఈ ఉదయం!" అని ఆశ్చర్యపడింది. ★

చిన్నదొంగ—ఫోటో: వి. కుటుంబరావు—మద్రాసు.

 **స్కార్లెట్ పింపర్నల్** 

(43 వ పేజీ తరువాయి)

"సిత్తం బాబూ! మూసుకుంటాను కాని ఒక్క మాట. తమరు సెప్పటం నేను సెయ్యక పోవటమా? అదికాదండి, ఈ అర్ధరాత్రివేళ ఇక్కడ నే నొక్కణ్ణే ఉంటే, ఏ కొరివిదయ్యాలో కామినీ పిశాచాలో వత్తా యనుకోండి. అప్పుడుగూడా నేను బయంతో అరవ టానికి ఈల్లేదాండి! అట్టాబయంతో నేను కేకేసినా, పారిపోయినా, నా తాటఒలిపించటమేనా బాబుగారూ!"

యూదు పాపం ఆపాదమస్తకం వణికిపోయినాడు. అతడు చెప్పినదానిలో అబద్ధమేమీ లేదు. అతనిని ఒంటిగా విడిచిపోతే భయంతో అరవకమానడు. అది విని పింపర్నల్ జాగ్రత్త పడవచ్చు. ఒక క్షణం ఆలోచించాడు పావలిన్.

"అయితే నీ గుఱ్ఱము, బండి ఇక్కడ విడిస్తే ఉంటాయి కదా!"

"వీడు దగ్గర ఉన్నా లేకపోయినా ఒకటే. ఆ మాటకు వస్తే, వీడు లేకపోతేనే అవి సురక్షితంగా ఉంటాయేమో!" అన్నాడు డెజ్ గాజ్.

"డెజ్ గాజ్! ఎలా వీడితో?"

"పోనీ ఆబండితో కలే పంపించి వెయ్యండి?"

"కాదులే! ఆ బండి మనకు అవసరముంటుంది. ఇప్పుడు గాయపడే వారిని తీసుకుపోవాలికదా? సరే ఏయ్ నీవు నోరుమూసుకొని మా వెంటరా. డెజ్ గాజ్ ఒక గుడ్డతో వాడి నోరు గట్టిగా మూసికట్టు."

అక్కడ ఒంటరిగా పడిఉండే కంటే, ఈ కష్టమైనా పడడమే మేలని అనుకున్న యూదు అందుకు సిద్ధపడ్డాడు.

"తొందరగా; తొందరగా! ఇప్పటికే చాలా ఆలస్యమై పోయింది."

ముగ్గురూ బయలుదేరారు. మార్గరెట్ కూడా మళ్ళీ వారి ననుసరించింది. ఏ కొద్ది ఆశయినా మిగిలి ఉంటే, అది కాస్తా దీనితో వదిలిపోయింది. బరువుగా కాళ్ళీడ్చుకొంటూ నడవసాగింది.

భూమ్యాకాశాలు దద్దరిల్లేటట్లు పొలికేకలు పెట్టి కుటీరంలో ఉన్న వారినందరిని హెచ్చరించాలనే ఉద్దేశ్యం కూడా ఆమెకు కలిగింది. కాని అందువలన ఏమీ ప్రయోజనం ఉండకపోగా, దుష్ఫలితాలు కలుగుతా యేమోనని భయపడింది.

బ్లాంబార్డ్ శిథిల కుటీరం కనుచూపు దూరంలో కనిపిస్తున్నది. మార్గరెట్ కు ఆవేశం ఎక్కువైంది. మరొక ప్రక్కన గుట్టక్రింద సముద్రం హోరెత్తుతూ కనిపిస్తున్నది. తీరానికి దూరంగా ఒక నౌక ప్రయాణానికి సిద్ధంగా ఉన్నది. అది ఏ నౌకో గుర్తు తెలియక పోయినప్పటికి అది డేడ్రీమ్ అయి ఉంటుందని మార్గరెట్ ఊహించింది. ఆ నౌకలో మళ్లా పెర్సీ అడుగు పెట్టలేడు!

నౌకను చూడటంతో మార్గరెట్ మనసులో మళ్లా కొంచెం ఆశ బయలుదేరింది. పావలిన్ కంటే, డెజ్ గాజ్ కంటే ముందుగా పరుగెత్తుకొనిపోయి, కుటీరం చేరుకుంటే, పారిపోవటం వీలు పడవచ్చు.

ఈ ఆలోచన కలగగానే ఆమె పావలిన్ మాట విస్మరించింది. ప్రాణాలకు తెగించింది. కాలిజోళ్లు తీసివేసి, పరుగెత్త నారంభించింది. ఆయాసంతో వగర్చుకుంటూ పరుగెత్తుతూ కాలుజారి, బోరగిలపడింది. ఆమె లేచే లోగానే డెజ్ గాజ్ ఆమె అరవకుండా నోరు మూసి గుడ్డకట్టాడు. ఇంతలో పావలిన్ ఆమెను సమీపించాడు. గుంటనక్క చూపులతో పరిశీలనగా చూశాడు. గ్రుడ్డి వెన్నెలలో వెంటనే పోల్చుకోలేక పోయినాడు.

"ఎవరో ఆడమనిషి! ఉండు. ఎవరు? మార్గరెట్ బ్లాకెనీ! ఓ! ఎంత తమాషాగా ఉన్నది?"

మార్గరెట్ నీరసించిపోయింది. స్పృతితప్పి పడిపోయింది.

## 24

మార్గరెట్ కు స్పృహ వచ్చేసరికి, మెత్తగా పరిచిన ఒక కోటు మీద ఒక రాతి నానుకొని కూర్చొని ఉన్నది. మబ్బులింకా ఆకాశంలో దట్టంగానే ఉన్నాయి. ఒక ప్రక్కన కొంచెం దూరంలో ఇద్దరు అదుర్దాగా మాట్లాడుకుంటున్నారు.

"కుటీరంలో మొత్తం నలుగురున్నారు. నెగడు దగ్గర చలికాచుకుంటూ కూర్చున్నారు. ఎవరికోసమో ఎదురు చూస్తున్నట్లున్నారు."

"ఇప్పుడు టైమెంతయింది?"

"రెండు గంటలు కావస్తున్నదండి".

"గాలివాలు ఎలా ఉన్నది?"

"మన తీరంవైపునకే ఉన్నది. ఇక్కడ నుండి

పోవటానికి అనువైన గాలి యింకా తిరగలేదు."

"అక్కడ కనిపిస్తున్న నౌకసంగతి ఏమిటి?"

"అది ఇంగ్లీషు వాళ్ళదే. అయితే దాని తాలూకు చిన్నపడవ ఎక్కడా కనిపించలేదు."

"ఆమె ఎక్కడ ఉన్నది?"

"మూర్ఛ నుండి ఇంకా తేరుకోలేదు. ఈ ప్రక్కనే ఉన్నది."

"యూదు?"

"కాళ్ళు చేతులు కట్టేసి ఆ ప్రక్కనే పడేశాం. నోరు ఎత్తటానికి వీలులేకుండా బిగించాం."

"సరే, వెళ్ళి జాగ్రత్తగా చూస్తూ ఉండు. ఇంగ్లీషు వాడు వచ్చేదాకా ఒక్కరు కదలకూడదు. రాగానే కుటీరంలో దూరి పట్టుకోండి."

పావలిన్ ఆజ్ఞను శిరసావహించి డెజ్‌గాజ్ వెళ్లిపోయినాడు. పావలిన్ మెల్లిగా మార్గరెట్‌ను సమీపించాడు. ఆమెచేయి తన చేతిలోకి తీసుకొని అన్నాడు. "మీకు చాలా శ్రమకలిగిస్తున్నాను మార్గరెట్ సెంట్ జస్ట్! ఈ విధంగా మీ నోరు కట్టి ఉంచడం నాకు మాత్రం ఇష్టమా? ఈగుడ్డ తీసివేస్తాను. కాని ఒక్క షరతు: మీరు ఒక్క చిన్న శబ్దం చేశారా? పింపర్నల్ ఇక్కడనుండి పారిపోతాడు. అతనికోసమే మనం ఇంత కష్టపడవలసి వచ్చినది."

ఒక క్షణం ఊరుకొని, పావలిన్ మళ్ళీ ఇలా నొక్కి చెప్పటం ఆరంభించాడు.

"బాగా ఆలోచించు. నీకు ఎదురుగా ఉన్న ఆ కుటీరంలో నీ సోదరుడు ఉన్నాడు. పింపర్నల్ కొరకు తక్కినవారితో కలిసి ఎదురుచూస్తున్నాడు. నీవు గనుక ఇప్పుడు అరిచావా, గందరగోళం జరగక మానదు. తుపాకి కాల్పులు అవసరమౌతాయి. పైగా పింపర్నల్ తప్పించుకుపోతాడు. అందువలన నీకేం ప్రయోజనం ఉంటుంది. అతడిలా తప్పించుకుపోవటం ఒక విధంగా నీకే చెరుపు. నీ సోదరుడి ప్రాణాలు నీచేతులమీదుగా పోగొట్టిన దానివౌతావు. నేను పడిన శ్రమ అంతా నిష్ఫలమౌతుంది. అలాకాకుండా నీవు పెదవులకుండా ఊరుకో! నీ సోదరుని, నిన్ను సురక్షితంగా ఇక్కడి నుండి పంపించే పూచీనాది."

మార్గరెట్ నోటికి గుడ్డకట్టి ఉండటం వలన ఏమీ బదులు చెప్పలేకపోయింది. పావలిన్ తీవ్రంగా

చూస్తున్నాడు. ఆమె ముఖకవళికలను బట్టి, తను చెప్తున్న దానికి ఆమె సుముఖంగానే ఉన్నదని గుర్తించాడు.

"ఆర్మండ్‌ను రక్షించుకోవటానికి నేను చెప్తున్న ఉపాయం ఏమంత కష్టమైన విషయమేమీ కాదు మార్గరెట్! కదలకుండా, మెదలకుండా నీవు ఇక్కడే ఉండాలి. నిశ్శబ్దంగా ఉండాలి. అంతే. లేదూ? చెప్తున్నా విను. నా సైనికులు ఆర్మండ్‌ను, తక్కిన ముగ్గురిని పట్టుకొని, నీ కళ్ల ఎదుట కాల్చిపారేస్తారు. ఆతరువాత నీ యిష్టం."

పావలిన్ చెప్పినదంతా శ్రద్ధగా విన్నది మార్గరెట్. తన కంఠంమీదికి మళ్లా కత్తిడి తెస్తున్నాడు. ఈసారి పర్యవసానం మరీ ఘోరంగా కనిపిస్తున్నది. తాను నోరుమూసుకొని ఊరుకోవాలి.తనభర్త బోనులో పడిన సింహంలాగా ఆ సైనికుల బంధనములలో పడి మృత్యు ముఖంలోకి పోతుంటే తాను నోరు మూసుకొని చూస్తూ ఊరుకోవాలి! లేదూ ? తన సోదరుడు, ముసలి కౌంట్, తను ముక్కు ముఖమూ ఎరుగని మరి ఇద్దరూ—ఇంతమంది చావుకు తాను కారణంకావాలి నెత్తురు కాలువలు పారించాలి! ఎంత ఘోరం?

మార్గరెట్ సమాధానం కోసం పావలిన్ వేగిరపడుతూ, ఎదురు చూస్తున్నాడు.

"అదికాదు మార్గరెట్. నీవు అనవసరంగా తొందరపడకు సుమా! అందరి మంచి చెడులతో నీకేమిటి సంబంధం! నీకు కావలసింది—నీ సోదరుడు—నీ తోడబుట్టినవాడు—నీ ఆర్మండ్! అతనిని రక్షించుకోవాలి గాని నీకు తక్కినవారేమైతేనేం? నా సైనికులందరికీ నేను ముందుగానే ఉత్తరువులు చేశాను. అతని కేటువంటి హానిచేయవద్దని. ఊరికే పింపర్నల్ గురించి బాధపడతావెందుకు నీవు? అతనికి నీకు ఏమి చుట్టరికం? ఎలాగూ అతడు బయటపడే మాట కల్ల. అందుచేత బుద్ధిగా నీసోదరుని రక్షించుకో! సరేనా? ఉండు నీ నోటికి కట్టిన ఈ గుడ్డ తీసివేస్తాను"

మార్గరెట్ మనసులో ఆలోచనలు సుడి తిరిగినాయి. గుండె దడ దడలాడింది. రాతి బొమ్మలాగా శూన్యంగా చూస్తూ కూర్చున్నది. పావలిన్ గుడ్డ తీసివేశాడు. ఆమె అరవలేదు. అరవటానికి ఓపిక లేకపోయింది.

క్షణమొక యుగంగా కాలం గడుస్తున్నది. ఇంతవరకు పింపర్నల్ రాలేదు. ఇప్పుడు వస్తాడు. అందరిని రక్షించటానికి తానేదో చేయాలనుకున్నది మార్గరెట్. కాని ఏమి చెయ్యాలి? కాలం గడుస్తూనే ఉన్నది. వింతవింత దృశ్యాలు ఆమె కన్నులకు కట్టినట్లు కనిపిస్తున్నాయి.

పెర్సీ వస్తాడు. సైనికులు కాలుస్తారు. పెర్సీని బంధిస్తారు; తీసుకుపోతారు.

లేదు. తాను పెద్దగాపొలికేకపెట్టి పెర్సీని హెచ్చరిస్తుంది. పావలిన్ సైనికులు కంగారుగాలేచి అటూఇటూ పరుగెత్తుతారు. పారిపోతున్న ఆర్మండ్‌ను తక్కిన ముగ్గురిని పట్టుకుంటారు. పావలిన్ కసిగా అట్టహాసం చేస్తాడు. తన కళ్ళ ఎదుట నిలబెట్టి వారిని కాల్చేస్తాడు!

అమ్మయ్యో! ఎలా? ఎలా? జరిగేదేదో జరిగిపోయినా బాగుండును. ఎంతకాలం వేచి ఉండటం? ఈ రాత్రి గడుస్తుందా? గడవదా?

కాలం గడుస్తున్నది. వేకువజాము అయింది. సముద్రం హోరెత్తుతున్నది. చల్లనిగాలి ఆరంభించింది. అంతా నిశ్శబ్దంగా ఉన్నది.

హఠాత్తుగా ఏ ప్రక్కనుండో తెలియకుండా ఏదో ఒక సమీప ప్రదేశంలోనుండే పాట వినిపించింది. ఆ కంఠస్వరంలో ఉత్సాహం ఉరకలు వేస్తున్నది. ఉల్లాసంగా పాడుతున్నాడు.

"గాడ్ సేవ్ ది కింగ్."

(ఇంకాఉంది)



మాస్కో విమానాశ్రయంవద్ద మార్షల్ బుల్గానిన్‌తో కరచాలనం చేస్తున్న ప్రధాని నెహ్రూ: "ప్రధాని నెహ్రూ రష్యాయాత్ర" సోవియెట్ డాక్యుమెంటరీ వర్ణచిత్రంలో దృశ్యం.

బొంబాయిసినిమా లేఖ:

# "ప్రధానమంత్రి రష్యాయాత్ర" సోవియెట్ వర్ణచిత్రం

"ప్రధానమంత్రి రష్యా యాత్ర" అనే పేరుతో ప్రధాని నెహ్రూ సోవియెట్ యూనియన్‌లో చేసిన 16 రోజుల పర్యటనను, వివరంగా చూపించే సోవ్ ఎక్స్‌పోర్ట్ చిత్రం జూలై 14 వ తేదీన బొంబాయిలో విడుదల కావడం చరిత్రాత్మక సంఘటనగా జరిగింది. ఇది రంగుల చిత్రం. నిడివి 13000 అడుగులు. సోవియెట్ సాంస్కృతిక శాఖవారు నిర్మించారు. రష్యాలో అగ్రగణ్యులైన 29 మంది వర్ణచ్ఛాయాగ్రాహకులు దీనిని షూట్ చేశారు. (వారిలో ఏడుగురు స్టాలిన్ బహుమతి పొందినవారున్నారు.) అద్భుత వర్ణాలలో, మనోజ్ఞ సంగీతంతో, హిందీ వ్యాఖ్యానంతో తయారైన ఈ చిత్రం ప్రథమ ప్రదర్శనం బొంబాయి రీగల్ సినిమాలో జరిగింది. మంత్రులు, రాయబారవర్గాల ఉద్యోగులు, ప్రముఖ పౌరులు, ఫిలిం వ్యక్తులు, బొంబాయి ముఖ్యమంత్రి శ్రీ మురార్జీ దేశాయి హాజరై ఈ ప్రదర్శనం చూసి ఆనందించారు.

ప్రధాని నెహ్రూ రష్యాలో చేసిన పర్యటనను, ఆకర్షవంతంగా, యథాతథంగా చూపించడమే కాక, ఈ చిత్రం సారవంతము, సంపద్వంతము, అయిన ఒక గొప్ప దేశాన్ని గూర్చి, ఆరోగ్యం, ఆనందం వెల్లివిరిసే ఒక జాతినిగూర్చి అనేక విశేషాలను తెలియజేస్తుంది. "ఇనప తెర" తాలూకు ఛాయలైనా ఎక్కడా కనిపించవు. ప్రధాని నెహ్రూ 16 రోజుల పర్యటనలో రష్యాలో ఏయే విశేషాలను తిలకించారో ఆయా విశేషాలన్నిటిని ప్రేక్షకులు ఈ చిత్రంలో చూడవచ్చును. అయితే ఒక్క తేడా. ప్రధాని 16 రోజులలో చూసినదానిని ప్రేక్షకులు చలనచిత్ర మహిమవలన 3 గంటలలో చూడగలరు.

మాస్కో విమానాశ్రయంవద్ద ప్రధానికి రష్యన్ అగ్రనాయకులు, మాస్కో పౌరులు హృదయపూర్వకంగా ఇచ్చిన అఖండ స్వాగతంతో చిత్రం ప్రారంభమవుతుంది. నెహ్రూకు జరిగిన సత్కారం చూస్తే మొదటి ప్రపంచయుద్ధానికి ముందరి మహారాజులు కూడా అసూయపడవలసిందే. ఆ తరువాత క్రెమ్లిన్ భవనాంతర్భాగాల అద్భుత దృశ్యాలు, భారతీయ భాషలుకూడా నేర్ప

 

# బొంబాయి సినిమా లేఖ



లోనే మాస్కో విశ్వవిద్యాలయం, జాతీయ ధన సంపద ప్రదర్శనం, సంగీతకారుడైన చైకోవిస్కీ రచించిన "మరాళ సరోవర" బృంద నృత్యం (మిస్ మాయా ప్లిసెట్స్కాయా నాయికగా నటించిన బాలే), మొదలైనవాటి దృశ్యాలు కనిపిస్తాయి. అన్నిటికంటే సుందరమూ, ఆశ్చర్యకరమూ అయిన అంశం భారత జాతీయ గీతం "జనగణమన"ను రష్యన్ యువతీ యువకులు రెండువందలమంది సంగీత నాటకం (ఒపెరా)గా అభినయించడం. మన జాతీయ గీతాన్ని ఇంతకుముందు ఎవరూ అంత మనోహరంగా పాడలేదు.

తరువాత వీర యోధ నగరం స్టాలిన్‌గ్రాడ్‌కు నెహ్రూతోపాటు చిత్రం కూడా ప్రయాణం చేస్తుంది. యూరల్ పర్వతాల లోని పారిశ్రామిక కేంద్రాలు, అల్టాయ్ పర్వతప్రాంతంలో సాగుచేయబడిన బంజరు భూములు, తాష్కెంట్, సమర్కండ్ నగరాలు (అతి ప్రాచీన నాగరికతల ప్రదేశాలు) కనిపిస్తాయి. ప్రధాని వెళ్ళినచోటల్లా ఆప్యాయమైన ఆహ్వానంతో, సోడా, షాంపేన్ పానీయాలతో ఆతిథ్యం ఇవ్వబడింది. పెద్దలు, పిల్లలు, స్త్రీలు ప్రధానిని చుట్టుముట్టి ఆలింగనం చేసుకోవడం ఈ దృశ్యాలలో కనిపిస్తుంది.

క్రిమియా ప్రకృతి సౌందర్యం, చారిత్రాత్మకమైన యాల్టా, లెనిన్‌గ్రాడ్‌లోని సుందరదృశ్యాలు కనుల విందుగా ఉన్నాయి. ఆఖరున మాస్కో డైనమో స్టేడియంలో వేలకొలది దృఢశరీరులైన యువతీ యువకులు గొప్ప విన్యాసాలు చేయడం, రెండు వేలమంది యువకులు హిందీ అక్షరాలలో "శాంతి" అని కనిపించేటట్లుగా వ్యూహం పన్ని ఎర్రజెండాలు ఊపుతూ నిలుచోవడం కనిపిస్తుంది. ఈ దృశ్యాల సౌందర్యం వర్ణచ్ఛాయా గ్రహణం వల్లనూ, చక్కని సంగీతం వల్లనూ ద్విగుణీకృతమైంది.

ప్రపంచంలో ఇతర ప్రాంతాల్లోవలెనే రష్యాలో కూడా మానవత్వం కలిగిన మానవులే ఉన్నారని ఈ చిత్రం చూపిస్తుంది. ఒక తేడా మాత్రం బాగా కనిపిస్తుంది. రష్యాలో కనిపించినంతమంది ఆరోగ్యవంతులు, నిర్భీకులు, మందహాసముఖులు అయిన పిల్లలు ప్రపంచంలో ఏ యితర దేశంలోనూ బహుశా కనిపించరు.

ఈ చిత్రంలో వ్యాఖ్యానంలో వాడబడిన హిందీ చాలా ఉత్తమశైలిలో ఉన్నది. ఈ వ్యాఖ్యానం మాస్కోలోనే తయారైనది. దీన్ని చూసి మన దేశంలోని డాక్యుమెంటరీ నిర్మాతలు పాఠాలు నేర్చుకోవచ్చును.

నిడివి కొంచెం ఎక్కువగా ఉన్నదనిపించినప్పటికీ ప్రపంచ చరిత్రలో అతి ముఖ్యమైన సంఘటనగా అన్ని దేశాలవారూ గుర్తించిన ప్రధాని నెహ్రూ రష్యా యాత్రా వృత్తాంతాన్ని ఈ చిత్రం చూపించిన విధానం అనుగుణంగా, చిత్తాకర్షకంగా, విజ్ఞానదాయకంగా ఉన్నది. ఏ భారతీయుడూ దీన్ని చూడకుండా వదలకూడదు.

* * *

నెహ్రూ చిత్రాన్ని సకోన్నా కంపెనీ వారు రష్యన్లవద్ద చాలా చవకగా తీసుకుని ఈ దేశంలో విడుదల చేశారు. బొంబాయిలో అత్యధిక ఆర్థికవిజయం పొందుతున్న అమెరికన్ చిత్రం "ఫాబ్యులస్ సెనోరిటా"

సాధనావారి "సంతానం"లో సావిత్రి, రేలంగి, నాగేశ్వరరావు.



సాధనావారి "సంతానం"లో ప్రేమతన్మయత పొందిన నాగేశ్వరరావు, సావిత్రి.

కూడా డిస్ట్రిబ్యూటర్లకు అతి చవకగా లభించింది. కనుక మన డిస్ట్రిబ్యూటర్లు కూడా యూరప్, జపాన్ లలో తయారయే చిత్రాలను చూస్తూఉండి, అవకాశం దొరికినప్పుడు హక్కులు కొనుక్కొని మన దేశంలో విడుదలచేసి లాభాలు పొందవచ్చును.

* * *

బొంబాయి పౌరులను ముగ్ధులను చేస్తున్న రష్యన్ చిత్రం వచ్చిన మరునాడే, రెండు కొత్తచిత్రాలు బొంబాయిలో విడుదల అయినవి. ఒకటి "మహాత్మ కబీర్", రెండోది "షాహీ మెహమాన్". ప్రొడక్షన్ విలువలలోను, టెక్నిక్ లోను ఒకదానికొకటి తీసిపోవు. రద్దు దండుగ చిత్రాలు. "కబీర్" చిత్రంలో కబీర్ వేషం జి. నాగేశ్వర్ ధరించాడు. అయనే దర్శకుడు కూడాను. ఈ చిత్రం 1941 లో వచ్చిన "భక్త కబీర్" అనే ఉత్తమ చిత్రానికి కాపీ. ఆ పాత చిత్రంలో కబీర్ గా భారత్ భూషణ్ మొదటిసారిగా నటించాడు.

"షాహీ మెహమాన్"లో శ్యామ ప్రధాన పాత్రధారిణి. చాలా చవకబారు చిత్రం.

* * *

మధుర గాయని లతామంగేష్కర్ ఆరోగ్యం ఈ మధ్య బాగుండడంలేదు. నిర్మాతలందరూ ఆందోళన పడుతున్నారు. ఈమధ్య ఒక పాటపాడుతూండగా ఆమె కొంచెం రక్తం కక్కుకున్నదట. అప్పటి నుంచీ ఆమె ఎక్కడికి వెళ్ళినా ఒక డాక్టరు కూడా వెడుతున్నాడు. స్నేహితులు, బంధువులు సంపూర్ణ విశ్రాంతి తీసుకోమని సలహా ఇస్తున్నారుగాని, కాంట్రాక్టులలో మునిగిపోయిన లతా ఆ సలహా పాటించడం లేదు.

* * *

తన కిప్పుడు 26 ఏళ్ళని నర్గీస్ జూన్ 1 న ప్రకటించింది. నర్గీస్, అశోక్ కుమార్ తప్ప బొంబాయి ఫిలిం తారల్లో ఇంకెవరూ తమ అసలు వయస్సు [illegible] సురయ్యా, కామినీకౌశల్, నళినీ జయవంత్, విజయలక్ష్మి, బేగంపారా మొదలైన చాలామంది నర్గీస్ కంటే పెద్దవారైనా ఇంకా తమకు పాతికేళ్ళయినా లేవని చెబుతూ ఉంటారు.

* * *

మెక్లీన్ ప్రొడక్షన్స్ అనే అమెరికన్ టెలివిజన్ కంపెనీవారు మహారాష్ట్రీ నర్తకి హీరాసావంత్ తో ఒక చిత్రం నిర్మించారు. ఆమె చేసిన కథక్ నృత్యాన్ని వారు షూట్ చేశారు. ఈ చిత్రాన్ని వారు అమెరికాలో టెలివిజన్ లో ప్రదర్శిస్తారు. టెలివిజన్ లో అభినయించిన మొదటి భారతీయ నటి ఈమెయే.

* * * *

నటుడు షమ్మీ కపూర్ గీతాబాలికి ఒక కొటారు కారు బహూకరించాడు.

* * * *

కొత్తనటుడు సునీల్ దత్ తనకు కిందటి నెల జరుగవలసిన వివాహాన్ని వాయిదా వేశాడు. అతని తల్లి నిశ్చయపరిచిన మంచి సంబంధాన్ని అతను త్రోసివేసి ఇప్పుడప్పుడే వివాహం చేసుకోనని ఖండితంగా చెప్పివేశాడు. ఇప్పుడు పెళ్ళి చేసుకుంటే ప్రారంభదశలో ఉన్న తన ఫిలిం జీవితానికి ఆటంకాలు వస్తాయని అతను ఇలా చేశాడు. ★



"సా కా నోట్"లో మనోరమ, గీతాబాలి, కృష్ణకుమారి.

# సినిమా వార్తలు

హైదరాబాదు రాష్ట్రానికి చెందిన సినిమా కళాభిమానులు కొందరు శ్రీ ఇ. అన్నారెడ్డిగారి అధ్వర్యాన జమ్మిగుంటలో కల్పనా ఫిలిమ్స్ లిమిటెడ్ అనే సంస్థను నెలకొల్పారు. వీరొక తెలుగు చిత్రం నిర్మించేందుకు నిశ్చయించుకున్నారు. నిర్మాణ పన్నాహాలు జరుపుటకు కంపెనీకి సంబంధించిన శ్రీ ఎ. చంద్రమౌళిగారు పరివారంతో మద్రాసు వచ్చారు. కథారచన మున్నగునవి దసరాలోగా పూర్తిచేసుకుని విజయదశమి నాటికి సెట్సుమీదకు వెళ్లేందుకు ఏర్పాట్లు చేస్తున్నారు.

* * *

## "సంతానం"

నాగేశ్వరరావు, సావిత్రి, రంగారావు, రేలంగి, రమణారెడ్డి మున్నగు ప్రముఖ తారాగణం నటించిన సాధనా వారి "సంతానం" ఈనెల 29 వ తేదీన విడుదల కాగలదని తెలుస్తోంది. దీనికి దర్శకుడు శ్రీ సి. వి. రంగనాథదాసు. పర్యవేక్షకు గా ప్రసాద్. సంగీత దర్శకుడు దక్షిణామూర్తి. రచన అనిసెట్టి సుబ్బారావు, పినిసెట్టి శ్రీరామమూర్తి.

* * *

అన్నపూర్ణావారి "దొంగ రాముడు" చిత్రం విడుదల వాయిదా వేశారని తెలుస్తోంది. ఎ. వి. ఎమ్. వారి "వదిన" చిత్రం ఆగస్టు 4 వ తేదీన విడుదల కాగలదట.

* * *

శ్రీమతి జానకి నటించిన చిత్రాలు ఈ ఏడాదిలో నాలుగు విడుదల అయినవి (పేదల ఆస్తి, రోజులు మారాయి, చెరపకురా చెడేవు, కన్యాదానం). బహుశా మరొక మూడు చిత్రాలు ఈ ఏడాది విడుదల అవుతాయి. ఇవి కన్యాశుల్కం, ఎ. వి. ఎమ్. వారు తీస్తున్న వదారము, నాగులచవితి చిత్రాలు.

## కే॥ శే॥ బారువా కథతో చిత్రం

బెంగాలీ దర్శకుడు కే॥ శే॥ పి. సి. బారువా చనిపోవడానికి ముందు వ్రాసి ఉంచిన ఒక కథను ఆయన భార్య జమునా నేడు చిత్రం తీస్తుందని తెలుస్తోంది. ఈ కథ కి దేవదాసు కూడా బారువా వ్రాసి ఉంచారట. ఒకప్పుడు బారువా కీ న్యత్తై ఉండి ఇప్పుడు ప్రసిద్ధ

కొక్కరిన నీరేన్ లాహిరి, సుశీల్ మజుందార్, సౌమ్యేన్ ముఖర్జీ, ఫణిమజుందార్, మణిఘోష్, ప్రభాత్ మిత్ర ఈ చిత్రంలో భిన్న భిన్న ఘట్టాలకు దర్శకులుగా పనిచేస్తారట. దీని కథ సంగీతంపై ఎక్కువగా ఆధారపడి ఉంటుందట.

* * *

వంగీయ ప్రగతి చలచిత్ర నాట్య సంఘం వారు 1954లో ఉత్తమ చిత్రంగా "జాదూ భట్టా"ను, ప్రజాదరణ ఎక్కువగా పొందిన చిత్రంగా "భాంగాగరా"ను నిర్ణయించారు. ఉత్తమ దర్శకుడు నీరేన్ లాహిరి, ఉత్తమ నటుడు ఉత్తమకుమార్, ఉత్తమ నటి అనుభాగుప్త, ఉత్తమ నాయికాపాత్రధారిణి సుచిత్రాసేన్, ఉత్తమ ప్లేబాక్ గాయకుడు ధనంజయ భట్టాచార్య అని కూడా నిర్ణయించారు.

* * *

మధుర గాయకుడు కీ॥ శే॥ కె. ఎల్. సైగల్ స్మారకనిధిని సేకరించడానికి మొదటి ప్రయత్నంగా ఇటీవల బొంబాయిలో న్యూథియేటర్స్ వారి "ప్రెసిడెంట్" ప్రదర్శించారు. అఖిల భారత సైగల్ స్మారక సంఘం వారు ఏర్పాటుచేసిన ఈ ప్రదర్శన సందర్భంలో సంఘ అధ్యక్షులు ఎస్. కె. పాటిల్ గారు మాట్లాడుతూ "అత్యుత్తమ గాయకుడైన సైగల్‌కు తగిన స్మారక చిహ్నమును స్థాపించడానికి ఈ సంఘం కృషి చేస్తున్న"దని చెప్పారు. దేశమంతటా పాఠశాలల్లోనూ, కళాశాలల్లోనూ సంగీతపు పోటీలు పెట్టడంద్వారా గాని, సైగల్ పేరుమీదుగా ఆరుబయలు సినిమాలు నిర్మించడం వలన గాని, లలిత కళా పాఠశాలను స్థాపించడం వలనగాని సైగల్ స్మృతి శాశ్వతంగా ఉండేలా చేయవచ్చునని ఆయన అన్నారు. తమ కృషికి తోడ్పడవలసిందని ఆయన ప్రజలను కోరారు. ★



ఎ. వి. ఎమ్. వారి "వదిన"లో రేలంగి



మద్రాసు, గోఖలేహాలులో ఇటీవల నృత్యప్రదర్శనం ఇచ్చిన కుమారి కళావతి; ఆమెకు వెండికప్ బహూకరిస్తున్న ప్రొ॥ కె. సాంబమూర్తిగారు.



## ★విజ్ఞాన వీథులు★

### అతీంద్రియ శక్తులు

ఉన్నాయా అని మద్రాసునుండి నాడి రెడ్డి రాముగారు అడుగుతున్నారు. అతీంద్రియ శక్తులు ఉన్నాయా అంటారా? మన శాస్త్రాలు అణిమ, మహిమ, గరిమ, లఘిమ, పరకాయ ప్రవేశము, జల వాయు అగ్ని స్తంభనాలూ అన్న 'సిద్ధు'లను గురించి చెప్తాయి. రామకృష్ణ పరమహంస వివేకానందుని కాలు తొక్కగానే ప్రపంచము గిర్రున తిరిగి క్రమంగా మాయము కావటముతో వివేకానందుని (అప్పుడు నరేంద్రుడే)కి భయము వేసి అరచినాడట. కనక అతీంద్రియ శక్తులన్నవి ఉన్న వనుట నిజము.

అయితే, రామకృష్ణస్వామికి ఈ రకపు శక్తులమీద మోజు ఏమాత్రమూ లేదని మనము చక్కగా గ్రహించవచ్చును. ఏమంటే ఒక గృహస్థు ఆయనకడకు వచ్చి 'నిర్వికల్ప సమాధి'ని అనుభవమునకు తెమ్మని ప్రార్థించెనట. స్వామి సరే అని స్పర్శ వల్ల (కొబోలు) ఆయనకు నిర్వికల్ప సమాధిని కల్పించెనట. తిరిగి స్ఫురణ వచ్చుటలో ఆ గృహస్థు "స్వామీ. నాకు భార్యా బిడ్డ

సాధనా వారి "సంతానం"లో
క్రొత్త నటి కుమారి కుసుం.



★

ఎ. వి. ఎమ్. వారి
"వదిన"లో రేలంగి, సావిత్రి.



"హౌస్ నంబర్ 44"లో భార్యాభర్తలు దేవ్ ఆనంద్, కల్పనాకార్తిక్.

ఉన్నారు. ఈ సమాధిలో నేను కూర్చుంటే ఎలాగు సాగుతుంది?" అన్నాడట. తన ప్రయత్నఫలితమును చూచి స్వామి నవ్వుకొన్నాడట.

ఇంకొకమార్గు పైన చెప్పిన సిద్ధులలో జలస్తంభన విద్యను సాధించిన యోగి రామకృష్ణస్వామికడకు వచ్చెనట. ఆ సిద్ధుని గని స్వామి 'ఇది యెన్నాళ్ళ కృషి' అని అడుగగా, ఆయన 'నలభై ఏళ్లు' అని ప్రత్యుత్తరమిచ్చెనట. స్వామి నవ్వి "అర్థణా ఇస్తే నదిని దాటేస్తాడే పడవవాడూ! అర్థణా విద్యకి నలభై సంవత్సరాలు కర్చుపెట్టారా? అన్నారట. అతీంద్రియ శక్తియొక్క ప్రాపంచికోపయోగాన్ని గురించి స్వామికి ఉన్న గౌరవము అది. ఎందువల్ల? జీవితాశయసిద్ధికి అది పనికిరాదు గనక.

ఇంకొకమారు అదృశ్యయోగము సాధించి తానుకోరిన స్త్రీకడకు చేరినవ్యక్తిని గురించి శిష్యులు స్వామికి చెప్పినారట. స్వామి, రెండవమారు ఆయన ప్రయత్నమేమైనదీ చెప్పమన్నాడట. మొదటి కక్కూర్తితో ఆ నరునికి సిద్ధి ఫలించినది. రెండవమారు పట్టుబడిపోయి దేహశుద్ధి పొందినాడట. అతీంద్రియ శక్తులు ఏ ప్రహ్లాదుని, ధ్రువుని, త్యాగరాజు, వంటివానినో 'అంబుజోదర దివ్య పాదారవింద చింతనామృతపాన విశేష మత్త చిత్తుని'గా చేయుటకు నారదాది మహర్షులు ఉపయోగించినారు. ఇహలోక ఫలములకోసము ఉపయోగిస్తే అతీంద్రియ శక్తులు ఇంద్రియశక్తుల పాటి చెయ్యవు.

పూజ్యశ్రీ జిడ్డు కృష్ణమూర్తిగారిని—వారి ఇష్టమునకు వ్యతిరేకముగనే—'ఈ వ్యాధిని కుదుర్చుడ'ని 'భక్తులు' కోరినప్పుడాయన నవ్వి "కుదిరిన తర్వాత వీరు పాత పద్ధతులనే అనుసరించి ఈ వ్యాధులను తిరిగి తెచ్చుకోరని ఏమి నమ్మకము?" అంటారట.

రామానుజస్వామి ధనుర్దాసుకు రంగనాథస్వామి కన్నులను చూపించు యత్నములో, శంకరులు ఉభయ భారతికి పూజ్యత్వము సాధించుటకు, రమణ మహర్షి మన చలం గారువంటివారిని కూర్చుటకు అతీంద్రియ శక్తు లుపయోగించిరి. అతీంద్రియశక్తి సర్వేశ్వరుని కంఠమాలా సుగంధము. దానికి మల్లె వాసన వర్ణించదగదు పోవదు. అతీంద్రియ శక్తివల్ల కొందరు వ్యాధులను కుదుర్తురట. తక్కువ ప్రయోజనాలను తృణీకరించినంత ఆవేశముతో ఈ ప్రయోజనమును తృణీకరించుటకు నాకు ధైర్యము చాలకున్నది గాని కృష్ణాజీ జవాబును వింటే ఈ ప్రయోజనము మాత్ర మేమంత ఉదాత్తము? అనిపించుచున్నది. కనికని జబ్బులు కుదుర్చుటా? తిరిగి గతానుగతిక లోకములో పాత తప్పులనే చేయుటకా? నేలమీది వానిని మేడ కెక్కుట ఎంతపాటిదో, గోతిలో నున్న వానిని నేలమీది కెత్తుటా అంత పాటిదే. వానియంతట వాడే యత్నము చేయుచో వాని దృష్టిని వెలుపలికైపు త్రిప్పుట మాత్రము అతీంద్రియ శక్తికి చక్కని వ్యవసాయము. వ్యాధులు కుదుర్చువా రక్షివారే నేమో!





విజయభట్ చిత్రం "పట్రాణి"లో నటిస్తున్న కొత్త హిందీ నటి రంజన శుక్లా.

Printed and Published for Nageswara Rao Estates Ltd., by S. Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor: S. Sambhu Prasad.



న డ వ —ఫొటో : పి. గురుమూర్తి, మద్రాసు.

# ఆమె
# ప్రకాశవంతమైన తెల్ల చీరలు
# ఆమె స్నేహితులు
# మెచ్చుకొనునట్లు
# చేసినవి







నిత్యమూ మా యజమానురాలు ధరించు బట్టలకు అంత తెల్లదనము ఎట్లు వచ్చినదో ఆమె స్నేహితులు అందరి రహస్యము ఆమెను అడిగేవరకూ తెలుసుకొనలేక పోయిరి.





తన తెల్లబట్టలకి (నూలువి అట్టు సిల్కువి) ఎల్లప్పుడూ టినోపాల్ వాడి అంత తెల్లదనము పొందుచున్నట్లు వారికి తెలిపెను. టినోపాల్ వాడిన బట్టలుతెల్లగా మెరియుటచే స్పష్టముగా తెలియును.

టినోపాల్ యొక్క విశేష తెల్లదనము 3, 4, సార్లు ఉతికేవరకు నిలుచును. అందుచే దీనిని తరుచు వాడ నవసరములేదు. పైగా టీ స్పూనులో నాలుగోవంతు మాత్రపు టినోపాల్ ఒక బాల్చీడు బట్టలను తెలుపుచేయును.




# టినోపాల్




బట్టలను అన్నిటికంటె మిక్కిలి తెల్లగ చేయును

అమాల్గమేటెడ్ కెమికల్స్ అండ్ డైస్టఫ్స్ కం. లి
పి. బి 965 బొంబాయి

SISTA'S AML-7-TEL.